# ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలో చీలుబాటలకు కారకులెవరు ?

రచన :
"పీపుల్స్ డెయిలీ", "రెడ్ ఫ్లాగ్" పత్రికల
సంపాదక వర్గాలు - ఫిబ్రవరి 4, 1964

7

జనశక్తి ప్రచురణలు

# ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలో చీలుబాటులకు కారకులెవరు ?



"పీపుల్స్ డెయిలీ", "రెడ్ ఫ్లాగ్" పత్రికల
సంపాదక వర్గాలు



జనశక్తి ప్రచురణలు
అమరావతి రోడ్డు, గుంటూరు-2

ప్రచురణ నెం. 28

---

ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలో చీలుబాటలకు కారకులెవరు ?

---

నవంబరు – 1982

వెల :

**రు. 2-00**

1963 జూలై 14న సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ, "బహిరంగలేఖ" అంటూ ప్రకటించినదానికి చైనా కమ్యూనిస్టు పార్టీ పత్రికలైన "పీపుల్స్ డెయిలీ", "రెడ్ ఫ్లాగ్"లు సంయుక్త సంపాదకవర్గ నాయకత్వాన ఒక్కొక్క అంశాన్ని తీసుకొని వరుసగా సమాధానా లిచ్చాయి. ఇది 7వ వ్యాఖ్య. ఈ వ్యాఖ్యానికి "పీపుల్స్‌డెయిలీ", "రెడ్ ఫ్లాగ్"లు పెట్టిన శీర్షిక: "మనకాలంలో సోవియట్‌పార్టీ నాయకులు అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో పెద్ద విచ్ఛిన్నకులు."

కాపీలకు :
మైత్రి బుక్ హౌస్,
లబ్బీపేట,
విజయవాడ–10.

ముద్రణ :
శ్రీ నాగార్జున ప్రింటర్సు,
మ్యూజియం రోడ్,
విజయవాడ – 2.

# ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలో చీలుబాటులకు కారకులెవరు ?

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యతకు ఈనా డేర్పడ్డంత తీవ్ర ప్రమాదం ఇంతకు ముందెన్నడూ ఎదురవలేదు. ఈనాడు మనం ఆధునిక రివిజనిస్టు సిద్ధాంత ప్రళయాన్ని చూస్తున్నాం. అటు అంతర్జాతీయంగానూ, ఇటు వ్యక్తిగత పార్టీలలోనూ మార్క్సిజం - లెనినిజానికీ, రివిజనిజానికీ మధ్య భీషణ పోరాటాలు సాగుతున్నాయి. ఈనాడు అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం ఇంతకు మున్నెన్నడూ లేనంత తీవ్రంగా చీలిపోయే ప్రమాదాన్ని ఎదుర్కొంటోంది.

సోషలిస్టు శిబిర ఐక్యతనూ, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యతనూ రక్షించుకొనడం ప్రపంచంలోని కమ్యూనిస్టుల, కార్మికవర్గ విప్లవ ప్రజాశక్తుల తక్షణ కర్తవ్యం.

# చైనా పార్టీ కృషి

మార్క్సిజం-లెనినిజాన్ని అనుసరించి, 1957 మాస్కో ప్రకటన, 1960 పత్రాలలోని విప్లవసూత్రాల ఆధారంగా, సోషలిస్టు శిబిర ఐక్యతను అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యతను రక్షించేందుకు చైనా కమ్యూనిస్టుపార్టీ నిరంతరం అంకితమైన కృషిచేసింది. సూత్రానికి కట్టుబడి వుండాలనీ, ఐక్యతను కాపాడాలనీ, విభేదాలను తొలగించుకొని మన ఉమ్మడి శత్రువుకు వ్యతిరేకంగా పోరాటాన్ని బలోపేతం చేసుకోవాలన్న పరిస్థితికి చైనా కమ్యూనిస్టుపార్టీ లోగడా కట్టుబడివుంది, ఇకముందూ గట్టిగా నిలబడ్తుంది.

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ నాయకులు రివిజనిజం మార్గాన్ని చేపట్టినప్పటినుండీ, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యతకే తాము అంకితమైయున్నామని విసుగూ, విరామమూ లేకుండా చెప్పుకోసాగారు. ఇక ఇటీవల వారు "ఐక్యత" అంటూ చాల చురుకుగా కేకలు వేస్తున్నారు. వీరి పనులు చూస్తూంటే తొంబై సంవత్సరాలక్రితం ఎంగెల్స్ చెప్పిన మాటలు గుర్తుకొస్తున్నాయి: "ఐక్యత" అంటూ కేక పెట్టినంత మాత్రాన్నే ఎవరూ మోసపోగూడదు. ఈ మాటను ఎక్కువసార్లు ఉచ్చరించేవారే పెద్ద చీలికకు మార్గం వేస్తారు...... పెద్ద పెద్ద సెక్టేరియన్లు [ఒంటెత్తు పోకడలుపోయే బాపతు], పెద్ద పెద్ద కజ్జాకోరులూ, దుష్టులే ఒక్కొక్కప్పుడు అందరికంటే బిగ్గరగా ఐక్యత అంటూ కేకలు పెడతారు......"

("బెబెల్‌కు ఎంగెల్సు" వ్రాసినలేఖ: 1873 జూన్ 20, "మార్క్సు-ఎంగెల్స్ సెలెక్టెడ్ కరస్పాండెన్సు", మాస్కో విదేశీ భాషా ప్రచురణాలయం; పేజీ 345].

సోవియట్ పార్టీ నాయకులు ఒకవైపున తామే ఐక్యతా రక్షకులుగా

చెప్పుకుంటూ మరోవైపున, ఉద్యమంలో చీలికలు తెస్తున్నారన్న ముద్రను చైనా కమ్యూనిస్టుపార్టీపై రుద్ద ప్రయత్నిస్తున్నారు. సోవియట్ పార్టీ కేంద్రకమిటీ ప్రకటించిన "బహిరంగ లేఖ"లో యిలా వుంది:—

> "చైనా నాయకులు ఒక్క సోషలిస్టు శిబిర ఐక్యతనేగాక, యావత్ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యతనే విచ్ఛిన్నం చేస్తున్నారు; కార్మికవర్గ అంతర్జాతీయతా సూత్రాలను కాల రాస్తున్నారు; సోదరపార్టీలమధ్య ఉండాల్సిన అంగీకృత సంబంధాల స్థాయిని పూర్తిగా ఉల్లంఘిస్తున్నారు."

ఇదీ, ఆ తరువాత సోవియట్ పత్రికలలో ప్రకటితమైన వ్యాస పరంపరా చైనా కమ్యూనిస్టులను "సెక్టేరియన్ల"నీ, "విచ్ఛిన్నకుల"నీ రాస్తూ వచ్చాయి.

కాని అసలు వాస్తవాలేమిటి? సోషలిస్టు శిబిర ఐక్యతను విచ్ఛిన్నం చేస్తున్న దెవరు? అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యతను వమ్ము చేస్తున్నవారెవరు? కార్మికవర్గ అంతర్జాతీయతా సూత్రాలను కాలరాస్తున్న వారెవరు? సోదరపార్టీల మధ్య ఉండాల్సిన అంగీకృత సంబంధాల సాయిని పూర్తిగా భగ్నపరుస్తున్న దెవరు? మరో మాటలో చెప్పాలంటే, అసలైన సిసలైన విచ్ఛిన్నకు లెవరు?

ఈ ప్రశ్నలకు సరైన సమాధానం రావాలి. అప్పుడు మాత్రమే సోషలిస్టు శిబిర, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యతను కాపాడి పరిపుష్టం చేసుకొనే మార్గాన్ని అన్వేషించుకోగల్గుతాం. అప్పుడు మాత్రమే చీలిక ప్రమాదాన్ని దాటగల్గుతాం.

## చారిత్రక సమీక్ష

వర్తమాన అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో చీలికతత్వం యొక్క స్వభావాన్ని స్పష్టంగా అవగతం చేసుకోడానికీ, సరైనమార్గంలో దాన్ని ఎదుర్కొని పోరాడ్డంకోసమూ మనం, గత శతాబ్దం పైచిలుకు

కాలంలో అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ చరిత్ర ఎలా నడిచిందో పరిశీలించడం అవసరం.

మార్క్సిజం-లెనినిజానికీ, అవకాశవాదానికీ మధ్య, ఐక్యతా రక్షకులకూ చీలికలు తెచ్చేవారికీ మధ్య పోరాటం అనేది అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ చరిత్రలో అంతర్భాగంగా సాగుతూ వచ్చిందే. ఈ పరిస్థితి వ్యక్తిగతంగా అనేక దేశాల్లోనూ, అంతర్జాతీయ రంగంలోనూ వచ్చింది. ఈ దీర్ఘ పోరాటంలో మార్క్స్-ఎంగెల్స్-లెనిన్‌లు వాస్తవంలో శ్రామిక వర్గ ఐక్యతంటే ఏమిటో సిద్ధాంతస్థాయిలో స్పష్టపరిచారు; తమ ఆచరణలోనూ చూపించారు; ఈ విధంగా వారు అవకాశవాదాన్ని, రివిజనిజాన్ని, చీలికతత్వాన్నీ యెదుర్కోవడంలో మహోన్నతమైన ఆదర్శాలు నెలకొల్పారు.

1847 లో మార్క్స్ - ఎంగెల్స్‌లు తొలిసారిగా అంతర్జాతీయ కార్మికవర్గ సంస్థను స్థాపించారు. అదే కమ్యూనిస్టు లీగ్. వీరుభయులూ ఆ లీగ్ కార్యక్రమంగా వ్రాసిన ప్రఖ్యాత "కమ్యూనిస్టు ప్రణాళిక [మానిఫెస్టో]"లో చైతన్యవంతమైన, ఉత్తేజకరమైన పిలుపు నిచ్చారు — "సకలదేశాల కార్మికులారా, ఐక్యం కండి!" అందులోనే వారు శాస్త్రీయ కమ్యూనిజం అంటే ఏమిటో క్రమబద్ధంగా లోతుగా వివరించి చెప్పారు. ఆ విధంగా మార్క్స్-ఎంగెల్సులు, అంతర్జాతీయ శ్రామికవర్గ ఐక్యతకు సిద్ధాంత పునాది వేశారు.

మార్క్స్-ఎంగెల్సులు తమ జీవితమంతా సూత్రబద్ధమైన అంతర్జాతీయ శ్రామికవర్గ ఐక్యతకోసం నిరాఘాటంగా పాటుపడ్డారు.

## ఫస్ట్ ఇంటర్నేషనల్

1864 లో మార్క్స్-ఎంగెల్సులు ఫస్ట్(మొదటి) ఇంటర్నేషనల్‌ను ఏర్పర్చారు. అదే— ఇంటర్నేషనల్ వర్కింగ్ మెన్స్ అసోసియేషన్.

సకల దేశాల కార్మికోద్యమాలను సమైక్య పర్చేందుకే వారా సంస్థను నెల కొల్పారు. ఫస్ట్ ఇంటర్నేషనల్ వున్నంతకాలమూ వారు, బాకునినిస్టులకు, ప్రౌధోనిస్టులకు, బ్లాంక్విస్టులకు, లాస్సాలియన్లు వగయిరా బాపతుకు వ్యతిరేకంగా సూత్రబద్ధమైన పోరాటాల్ని నడిపారు. ముఖ్యంగా బాకునినిస్టు విచ్ఛిన్నకులకు వ్యతిరేకంగా భీషణ సమరం సాగించారు.

బాకునినిస్టులు మార్క్స్ సిద్ధాంతంపై మొదటినుంచీ దాడి ప్రారంభించారు. మార్క్స్ తన "ప్రత్యేక ప్రోగ్రాంనే, తన వ్యక్తిగత సిద్ధాంతాన్నే ఇంటర్నేషనల్"లో పైచేయి చేసుకోవాలని కోరుతున్నాడని బాకునినిస్టులు ఆరోపించారు. కాని వాస్తవానికి ఇంటర్నేషనల్‌పై తన ముఠా పిడిసూత్రాలనే రుద్ది, ఇంటర్నేషనల్ ప్రోగ్రాం స్థానే అపనాశవాద పూరితమైన బాకునిన్ ప్రోగ్రాంను ప్రవేశపెట్టాలని ప్రయత్నించినవారు ఈ బాకునినిస్టులే. వారు ఒక కుట్ర తరువాత మరొక కుట్రపన్నారు. తిమ్మిని బమ్మిని, బమ్మిని తిమ్మినిచేసి "మెజారిటీ" అంటూ సృష్టించారు; ఒంటెత్తు వాద, విచ్ఛిన్న చర్యలకు దిగారు.

నిజమైన అంతర్జాతీయ శ్రామికవర్గ ఐక్యతను రక్షించడానికిగాను మార్క్స్-ఎంగెల్సులు, ఫస్ట్ ఇంటర్నేషనల్‌ను ఎదుర్కొన్న బాకునినిస్టు విచ్ఛిన్నకుల బహిరంగ సవాలుకు వ్యతిరేకంగా రాజీలేని సూత్రబద్ధవైఖరి తీసుకున్నారు. అప్పటికీ విచ్ఛిన్నకర చర్యలలోనే మునగానాం తేలానాంగానే వుంటున్న బాకునినిస్టులను 1872 లో హేగ్ మహాసభలో ఇంటర్నేషనల్ నుండి బయటికి గెంటివేయడం జరిగింది. ఈ మహాసభలో మార్క్స్ స్వయంగా పాల్గొన్నారు.

హేగ్ మహాసభలో గనుక బాకునినిస్టుల విచ్ఛిన్న చర్యలపట్ల సూత్రరహితమైన రాజీధోరణి అవలంబించి వున్నట్లయితే అంతర్జాతీయ కార్మికోద్యమానికి తీవ్రమైన దుష్ఫలితాలు సంభవించేవని ఎంగెల్స్ చెప్పాడు. ఎంగెల్స్ ఇలా అన్నాడు:

"అప్పుడు ఇంటర్నేషనల్ వాస్తవానికి ముక్కలు ముక్కలై పోయేది—"ఐక్యత" పేరుతో చెక్కలై పూరుకొనేది"!.

[బెబెల్‌కు ఎంగెల్స్ రాసిన లేఖ మార్క్స్ - ఎంగెల్స్ సెలెక్టెడ్ కరస్పాండెన్సు పే. 346]

ఈ విధంగా మార్క్స్-ఎంగెల్స్‌ల సారథ్యం క్రింద సాగిపోయిన ఫస్ట్ ఇంటర్నేషనల్ అవకాశవాదానికి, చీలికతత్వానికి వ్యతిరేకంగా పోరాడింది; అంతర్జాతీయ కార్మికోద్యమంలో మార్క్సిజం నాయకత్వానికి పునాది ఏర్పర్చింది.

1876 లో ఫస్ట్ ఇంటర్నేషనల్ అంతమైపోయినట్లు ప్రకటించారు. దానితో, వరుసనే అనేక దేశాలలో పెద్ద పెద్ద సోషలిస్టు వర్కర్స్ పార్టీలు ఏర్పడనారంభించాయి. ఈ పార్టీలు శాస్త్రీయ కమ్యూనిజం ఆధారంగా ఏర్పడి అభివృద్ధిలోకి వస్తాయన్న ఆశతో మార్క్స్ - ఎంగెల్సులు ఈ పార్టీల అవతరణనూ, అభివృద్ధినీ బహుశ్రద్ధగా పరిశీలిస్తూ వచ్చారు.

ఆనాడు యూరప్‌లోని కార్మికోద్యమంలో ముఖ్యస్థానాన్ని ఆక్రమించిన జర్మన్ సోషల్ డెమోక్రాటిక్ పార్టీపట్ల మార్క్స్- ఎంగెల్సులు ప్రత్యేక శ్రద్ధ చూపారు; ఆందోళనతో పరిశీలించారు. అనేక పర్యాయాలు వీరిద్దరూ, జర్మన్‌పార్టీ 'ఐక్యత' పేరుతో అవకాశవాదంతో రాజీపడే దుస్వభావాన్ని చాలా నిశితంగా విమర్శించారు.

1875 లో జర్మన్ సోషల్ డెమొక్రటిక్ పార్టీ సూత్రాలను గాలికి వదలి లాస్సాలియన్లతో చేయి కలిపినందుకు మార్క్స్-ఎంగెల్సులు జర్మన్ పార్టీని ఖండించారు. ఈ కలయిక ఫలితమే గోథా ప్రోగ్రాం [గోథా కార్యక్రమం], ఈ సఖ్యతకు "చెల్లించిన మూల్యం అపారం" అన్నాడు మార్క్స్. అంతేకాదు, గోథా ప్రోగ్రాము "పార్టీని నిర్వీర్యపరుస్తుంది. ఇది పూర్తిగా అభ్యంతరకరం" అన్నాడు మార్క్స్.

[బ్రాకీకి మార్క్స్ లేఖ"; మార్క్స్-ఎంగెల్స్ కరస్పాండెన్స్, పేజీ 360; 361]

ఈ కలయికను గూర్చి ఎంగెల్స్ యిలా అన్నాడు : "మొత్తం జర్మన్ సోషలిస్టు శ్రామికవర్గాన్నే లాస్సాలియన్లముందు మోకరిల్ల చేయడమే యిది.

ఈ ప్రాతిపదికపై ఏర్పడ్డ ఈ కలయిక పట్టుమని సంవత్సరం కూడా వుండదు."

["బెబెల్‌కు ఎంగెల్స్ లేఖ": సెలెక్టెడ్ కరస్పాండెన్స్, పేజీ, 358].

గోథా ప్రోగ్రాంను వివరిస్తూ మార్క్స్ ఒక ముఖ్య సూత్రాన్ని మార్క్సిస్టుల ముందుంచాడు.

"సూత్రాలకు సంబంధించినంతవరకు రాజీ అంటూ వుండదు."

["బ్రాకీకి మార్క్స్ లేఖ-మార్క్స్-ఎంగెల్స్" సెలెక్టెడ్ కరెస్పాండెన్స్: పేజీ, 361.]

పార్టీ లోపల అవకాశవాదుల చర్యల్ని సహిస్తూ వూరుకొంటున్నందుకు జర్మన్ పార్టీని మార్క్స్ - ఎంగెల్సులు నిశితంగా విమర్శించారు. మార్క్స్ అన్నాడు :

"ఈ అవకాశవాదులు. న్యాయం-స్వేచ్ఛ - సమానత్వం - సౌభ్రాతృత్వం అనే ఆధునిక పురాణ దేవతల్ని చూసి ... భౌతికవాద పునాదినే పెకిలించి వేయ ప్రయత్నిస్తున్నారు.

["ఎఫ్. ఎ. సోర్జికి మార్క్స్ లేఖ" సెలెక్టెడ్ కరస్పాండెన్స్, పేజీ 376.]

"ఇది పార్టీనీ, దాని సిద్ధాంతాన్నీ వక్రీకరించడమే" [పే, 396]

జర్మన్ పార్టీ నాయకులకు రాసిన "సర్క్యులర్ లెటర్"లో మార్క్స్ - ఎంగెల్సులు యిలా చెప్పారు :

"దాదాపు 40 సంవత్సరాలుగా మేము, వర్గపోరాటమనేది చరిత్రకు తక్షణ చోదకశక్తి అని నొక్కి చెప్పాం ! ముఖ్యంగా

బూర్జువావర్గానికీ, శ్రామికవర్గానికీ మధ్య వర్గపోరాటం అనేది ఆధునిక సాంఘిక విప్లవం యొక్క, బలమైన శక్తిఅనీ చెప్పాం. అందువల్ల ఉద్యమం నుంచి వర్గపోరాటాన్ని తొలగించగోరేవారితో సహకరించడం అనేది అసంభవం."

["బెబెల్‌కు మార్క్స్ - ఎంగెల్సుల లేఖ: సెలక్టెడ్ కరెస్పాండెన్స్: పే. 395].

# సెకండ్ ఇంటర్నేషనల్

ఎంగెల్స్ ప్రభావంతో 1889లో సెకండ్ (రెండవ) ఇంటర్నేషనల్ ఏర్పడింది. ఇది, పెట్టుబడిదారీ విధానం "శాంతియుతంగా" అభివృద్ధి చెందుతున్న దశలో వున్న ఇంటర్నేషనల్. మార్క్సిజం బాగా పరివ్యాప్తమై, "కమ్యూనిస్టు ప్రణాళిక" ప్రతిచోటా కోటానుకోట్ల కార్మికుల వుమ్మడి కార్యక్రమంగా రూపొందించిన ఈ దశలో, అనేక దేశాల్లోని సోషలిస్టు పార్టీలు ఈ ప్రణాళికను ఉపయోగించుకొని లక్ష్యాన్ని చేరుకోడానికే ప్రయత్నించే బదులు బూర్జువా చట్టబద్ధాధికారాన్ని గుడ్డిగా ఆరాధించి చట్టబద్ధవాదులుగా మారిపోయారు. ఆ విధంగా వారు అవకాశవాదానికి మార్గం చూపారు.

ఈ విధంగా సెకండ్ ఇంటర్నేషనల్ వున్నంతకాలమూ అంతర్జాతీయ కార్మికోద్యమం రెండు ప్రధాన శాఖలుగా— విప్లవ మార్క్సిస్టు-లెనినిస్టులు, కుహనా మార్క్సియన్ అవకాశవాదులుగా — విభజితమైంది.

అవకాశవాదులకు వ్యతిరేకంగా ఎంగెల్స్ రాజీలేని పోరాటాలు నడిపాడు. పెట్టుబడిదారీ విధానం శాంతియుతంగా సోషలిజంలోకి పరివర్తన చెందే విషయమై అవకాశవాదులు చెప్పిన తప్పుడు భాష్యాలను ఆయన

దాలా ఖండితంగా పూర్వపక్షం చేశారు. తామూ మార్క్సిస్టులమని "పోజు" పెట్టుకునే అవకాశవాదుల్ని గూర్చి ఎంగెల్స్ యిలా అన్నాడు:

"తనను గుడ్డిగా అనుకరించే వారిని గూర్చి జర్మన్ వ్యంగ్య రచయిత హీనే చెప్పిన మాటల్ని మార్క్స్ ఈ పెద్దమనుషుల కోసం పునరుద్ఘాటించాడు: "విత్తు ఒకటివేస్తే చెట్టు ఒకటి పుట్టుకొచ్చింది."

["పాల్ లఫార్గ్‌కి ఎంగెల్స్ రాసిన లేఖ"- "మార్క్స్-ఎంగెల్స్ ఆన్ లిటరేచర్ అండ్ ఆర్ట్; పారిస్ ప్రచురణ, 1954, పేజీ 258.]

1895లో ఎంగెల్స్ అస్తమించారు. ఆ తరువాత ఈ అవకాశవాదులు బాహాటంగా బయటపడి, మార్క్సిజాన్ని ఒక క్రమపద్ధతిలో వక్రపర్చసాగారు; క్రమేణా సెకండ్ ఇంటర్నేషనల్ నాయకత్వాన్ని చేజిక్కించుకున్నారు.

ఎంగెల్స్ అనంతరం అంతర్జాతీయ కార్మికోద్యమంలో సాటిలేని మేటి విప్లవవాది లెనిన్ అవతరించాడు. ఈ మహానాయకుడు మార్క్సిజాన్ని పరిరక్షించే బృహత్ కార్యక్రమాన్ని తనపై వేసుకొన్నాడు; అలాగే సెకండ్ ఇంటర్నేషనల్ చేపట్టిన రివిజనిజాన్ని ఎదుర్కొనే బాధ్యతను కూడా తన భుజస్కంధాలపై వేసుకొన్నాడు.

మార్క్సిజం "అసంపూర్ణమైనదనీ", "బూజుపట్టింద"నీ సెకండ్ ఇంటర్నేషనల్ రివిజనిస్టులు గావుకేకలు పెట్టినప్పుడు లెనిన్ ఎంత ఖండితంగా చెప్పాడో చూడండి:

"మార్క్సిస్ట్-సిద్ధాంత పునాదిపైనే పూర్తిగా మా వైఖరిని రూపొందించుకొంటాం". ఎందుచేతనంటే, అలాంటి సిద్ధాంతం మాత్రమే. "సోషలిస్టు లందరినీ సమైక్యపర్చ గల్గుతుంది." ["ప్రోగ్రాం" లెనిన్ కలెక్టెడ్ వర్క్స్; వాల్యూం:4. పేజి 210-211]

మీదుమిక్కిలి లెనిన్, రష్యాలో మార్క్సిస్టు పార్టీని ఏర్పర్చడానికి పోరాడాడు. ఒక సరికొత్త పార్టీని, అందునా సెకండ్ ఇంటర్నేషనల్‌లోని అవకాశవాద పార్టీలకు పూర్తిగా భిన్నమైన పార్టీని నిర్మించగోరాడు లెనిన్.

ఇందుకోసం ఆయన, రష్యన్ సోషల్ డెమోక్రటిక్ లేబర్ పార్టీలోని అనేక మార్క్సిస్ట్ వ్యతిరేక ముఠాలకు వ్యతిరేకంగా రాజీలేని పోరాటాలు నడిపాడు.

సెకండ్ ఇంటర్నేషనల్‌లోని ఇతర పార్టీల వలెనే రష్యన్ సోషల్ డెమోక్రటిక్ లేబర్ పార్టీలో కూడా విప్లవ (రివల్యూషనరీ) కర గ్రూపూ వుంది. అవకాశవాద ముఠాకూడా వుంది. లెనిన్ నాయకత్వాన వున్న బోల్షివిక్కులది విప్లవకర గ్రూపు. మెనివిక్కుల నాయకత్వాన వున్నది అవకాశ వాద ముఠా.

లెనిన్ నాయకత్వానవున్న బోల్షివిక్కులు, శ్రామికవర్గపార్టీ ఐక్యతను కాపాడేందుకు, పార్టీ సాధారణ సభ్యులలో చైతన్యమూ, పటుత్వమూ నిర్వీర్యపడకుండా కాపాడుకునేందుకు మెన్షివిక్కులకు వ్యతిరేకంగా సిద్ధాంత రాజకీయ పోరాటాల్ని నడిపారు. చివరకు 1912లో మెన్షివిక్కులను, అప్పటికీ దారికిరాక అవకాశవాదాన్ని, విచ్ఛిన్నకర చర్యల్ని ఇంకా కొన సాగిస్తున్నందుకు పార్టీనుంచి గెంటివేశారు.

ఇందుకుగాను అవకాశవాద ముఠాలన్నీ లెనిన్‌పై చాల నీచమైన ఆరోపణలు చేశాయి. ఎలాగోలా ఆయనకు విచ్ఛిన్నకారుడనే ముద్ర వేయాలని సర్వవిధాలా ప్రయత్నించారు. అవకాశ వాదుల లెనినిస్టు వ్యతిరేక ముఠాలన్నింటితో చెట్టపట్టాలు కట్టి, "ముఠాతత్వం కూడదన్న" జెండా పుచ్చుకుంటూనే ఆ జెండాక్రిందనే ట్రాట్స్కీ, బోల్షివిక్ పార్టీపైన, లెనిన్‌పైన క్రూరంగా విరుచుకపడ్డాడు. ఇతగాడు లెనిన్‌ను "అధికారాన్ని హస్తగతం చేసుకున్న వా"డనీ, "విచ్ఛిన్నకుడు" అనీ అన్నాడు.

అప్పుడు లెనిన్ ట్రాట్స్కీకి సమాధానం యిస్తూ, "ముఠా రహితుడుగా" తనను ప్రదర్శించుకొన్న ట్రాట్స్కీ "ముఠాతత్వ అవశేషాల్లో అతిహేయమైన శక్తులకు ప్రతినిధి" అన్నాడు. ["ఐక్యత అనే కేకల చాటున ఐక్యతా విచ్ఛిన్నం": లెనిన్ సెలెక్టెడు వర్క్స్. వాల్యూం 1;

పేజీ 251] ట్రాట్స్కీ "విచ్ఛిన్నకుల్లో విచ్ఛిన్నకుడు" అని కూడా లెనిన్ అన్నాడు. [సెలెక్టెడ్ వర్క్స్: వాల్యూం 20, పేజీ 142.]

# లెనిన్‌పై దుమారం

లెనిన్ చాలా స్పష్టంగా చెప్పాడు:

"ఐక్యత"-ఓహో, గొప్ప లక్ష్యం; గొప్ప నినాదం! కాని కార్మికుల లక్ష్యం, మార్క్సిస్టులందరి ఐక్యతను వాంఛిస్తోంది గాని మార్క్సిస్టు వ్యతిరేకులతోనూ, మార్క్సిజాన్ని వక్రీకరించే వారితోనూ మార్క్సిస్టులు ఐక్యం కావాలని మాత్రం కోరడం లేదు."

[లెనిన్ కలెక్టెడ్ వర్క్స్: వాల్యూం 20, పేజీ 211.]

మెన్షివిక్కులకు వ్యతిరేకంగా లెనిన్ సాగించిన పోరాటం గొప్ప అంతర్జాతీయ ప్రాధాన్యత గలది. ఎంచేతనంటే, సెకండ్ ఇంటర్నేషనల్ అనుసరించిన రివిజనిజానికి మారురూపే, రష్యన్ మాతృకే మెన్షివిజం! దీన్ని సెకండ్ ఇంటర్నేషనల్ రివిజనిస్టు నాయకులంతా బలపర్చారు.

మెన్షివిక్కుల్ని ఎదుర్కొంటూనే లెనిన్, సెకండ్ ఇంటర్నేషనల్ చేపట్టిన రివిజనిజానికి వ్యతిరేకంగా అనేక పోరాటాలు నడిపాడు.

ప్రథమ ప్రపంచయుద్ధానికిముందు లెనిన్, సిద్ధాంత – రాజకీయ రంగాలలో సెకండ్ ఇంటర్నేషనల్ రివిజనిస్టుల్ని విమర్శించ నారంభించాడు; స్టట్ గార్డ్, కోపెన్‌హాగన్ మహాసభల్లో వారితో ముఖాముఖీ వాగ్యుద్ధం సాగించాడు.

ప్రథమ ప్రపంచయుద్ధం ప్రారంభంకావడంతో సెకండ్ ఇంటర్నేషనల్ నాయకులు బాహాటంగానే శ్రామికవర్గానికి ద్రోహం తలపెట్టారు. వారు, సామ్రాజ్యవాదుల ప్రయోజనాల్ని కాపాడుతూ వివిధ దేశాల శ్రామికుల్ని పరస్పరం కుత్తుకలు త్తరించుకోమని కోరారు; ఆ విధంగా అంత

జాతీయ శ్రామికోద్యమంలో చాల తీవ్రమైన చీలిక తెచ్చిపెట్టారు. రోజా లగ్జెంబర్గ్ చెప్పినట్లు, "సకల దేశాల కార్మికులారా! ఐక్యంకండి" అన్న గర్వకారణమైన నినాదాన్ని రివిజనిస్టులు త్రోసిపుచ్చి సమరనినాదమైన "సకల దేశాల కార్మికులారా: ఒకరినొకరు వధించుకోండి" అని మార్చి వేశారు:

[సెలెక్టెడ్ స్పీచెస్ అఫ్ రోజాలగ్జెంబర్గ్: జర్మన్ ప్రతి: బెర్లి న్, వాల్యూం 2. పేజీ 534]

మార్క్స్ జన్మభూమి జర్మనీ. ఆ జర్మనీలోనే పుట్టిన సోషల్ డెమోక్రటిక్ పార్టీ ఆనాటికి సెకండ్ ఇంటర్నేషనల్‌లో అత్యంత శక్తివంత మైన పార్టీగా, పలుకుబడిగల పార్టీగా వుంది. అటువంటి పార్టీ స్వదేశీయ సామ్రాజ్యవాదుల్ని బలపర్చడంలో ముందు పీఠీన నిలబడింది. ఆ విధంగా అంతర్జాతీయ కార్మికోద్యమాన్ని విచ్ఛిన్నం చేయడంలో అది ఘరానా నేరస్థురాలైంది.

ఈ క్లిష్ట సమయంలోనే లెనిన్, అంతర్జాతీయ శ్రామికవర్గ ఐక్యతను కాపాడ్డంలో నిశ్చయాత్మకంగా పోరాడ్డానికి ముందంజ వేశాడు.

1914 ఆగస్టు నెలలో లెనిన్, "యూరప్ యుద్ధంలో రివల్యూషనరీ (విప్లవకర) సోషల్ డెమోక్రసీ కర్తవ్యాలు" అన్న వ్యాసం రాశారు. అందులో లెనిన్, సెకండ్ ఇంటర్నేషనల్ కుప్ప కూలిపోయిందని ప్రకటించారు: దాని నాయకుల్లో చాలామందిని ఆయనఘాటుగా విమర్శించారు; ముఖ్యంగా సోషలిజానికి బహిరంగంగా విద్రోహం తలపెట్టిన జర్మన్ సోషల్–డెమోక్రటిక్ పార్టీ నాయకుల్ని మరీ నిశితంగా విమర్శించారు.

సెకండ్ ఇంటర్నేషనల్ రివిజనిస్టులు, బూర్జువావర్గంతో తమకు ఇంతకుముందున్న రహస్య సఖ్యతను బహిర్గతం చేసుకున్న దృష్ట్యాను, ఆ విధంగా వారు అంతర్జాతీయ కార్మికోద్యమంలో చీలిక తప్పనిసరి చేయడం దృష్ట్యాను లెనిన్ ఇలా ప్రకటించారు:

సాంఘిక బూర్జువా ...



"కృత నిశ్చయంతో మనం అవకాశవాదంతో తెగతెంపులు చేసుకోకుండా, అవకాశవాదం యొక్క దివాళాకోరుతనం బహిర్గతం కావడం తప్పనిసరి అని ప్రజా బాహుళ్యానికి వివరించకుండా ప్రస్తుత సమయంలో సోషలిజం లక్ష్యాన్ని నెరవేర్చడం అసంభవం; అలాగే నిజమైన అంతర్జాతీయ కార్మికవర్గ ఐక్యతను సాధించడమూ అసంభవమే."

[లెనిన్ సెలెక్టెడ్ వర్క్స్: వాల్యూం 1; పేజీ 403]

# ఉద్యమ రక్షణకే థర్డ్ ఇంటర్నేషనల్

సరిగ్గా ఇందుకోసమే [పై చెప్పిన కారణం] లెనిన్, అనేక యూరోపియన్ దేశాలలోని అవకాశవాదులతో సంబంధాలు తెంచుకొంటున్న మార్క్సిస్టులను గట్టిగా బలపర్చాడు; దివాళా ఎత్తిన సెకండ్ ఇంటర్నేషనల్ స్థానే, అంతర్జాతీయ శ్రామికవర్గ విప్లవైక్యతను పునఃస్థాపించే థర్డ్ ఇంటర్నేషనల్ [మూడో ఇంటర్నేషనల్] నిర్మాణానికి ధైర్యంగా పిలుపు ఇచ్చాడు.

1919 మార్చి నెలలో థర్డ్ ఇంటర్నేషనల్ అవతరించింది. ఇది, సెకండ్ ఇంటర్నేషనల్ యొక్క క్రియాశీలమైన విజయాలను సంక్రమింపచేసుకొంది: కాగా దాని అవకాశవాద సాంఘిక దురహంకార, బూర్జువా, పెట్టీ- బూర్జువా చెత్తనంతా విసర్జించింది. ఈ విధంగా అంతర్జాతీయ శ్రామికవర్గ విప్లవ ~~లక్ష్యం వాహా బలుపు~~ ~~థర్డ్~~ ఇంటర్నేషనల్ దోహదం చేసింది.

లెనిన్ సిద్ధాంతమూ ఆచరణా మార్క్సిజాన్ని ఆ మహా వాహినిలో ఒక నూతన దశకు గొనిపోయింది. అదే లెనినిజం దశ. మార్క్సిజం— లెనినిజం ప్రాతిపదికగా అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యత మరింత బలోపేతమై విస్తృతమైంది.

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమాభివృద్ధి చరిత్ర ఏమని నిరూపిస్తోంది?

## I

అన్నింటిమాదిరే అంతర్జాతీయ కార్మికోద్యమం రెండుగా చీలుతుంది అని కమ్యూనిస్టు ఉద్యమ చరిత్ర చెపుతోంది; ఏమంటే, శ్రామిక వర్గానికీ, బూర్జువావర్గానికీ మధ్య సాగే వర్గ పోరాటం సాధారణ కమ్యూనిస్టు సభ్యులలోకూడా అనివార్యంగా ప్రతిబింబిస్తుంది. కమ్యూనిస్టు ఉద్యమాభివృద్ధి క్రమంలో ఏదో ఒక రకమైన అవకాశవాదం తలెత్తడం అనివార్యం. అలాగే మార్క్సిస్టు-లెనినిస్టు వ్యతిరేక విచ్ఛిన్న చర్యలకు అవకాశవాదులు దిగడమూ, మార్క్సిస్టు-లెనినిస్టులు ఇందుకు ప్రతిగా అవకాశవాదానికీ, విచ్ఛిన్న చర్యలకూ వ్యతిరేకంగా పోరాటాలు సాగించడమూ అనివార్యం. ఈ రెండు భిన్న వైరుధ్యాలమధ్య పోరాటం ద్వారానే మార్క్సిజం - లెనినిజమూ, అంతర్జాతీయ కార్మికోద్యమమూ ఎదిగి వచ్చాయి. అలాగే ఈ భిన్న వైఖరుల మధ్య నిరంతర పోరాటం ద్వారానే అంతర్జాతీయ కార్మికోద్యమం బలపడింది; మార్క్సిజం-లెనినిజం ఆధారంగా తన ఐక్యతను సుస్థిరం చేసుకుంటూ వచ్చింది.

ఎంగెల్సు యిలా అన్నాడు:

"శ్రామికోద్యమం తప్పనిసరిగా విభిన్న అభివృద్ధి దశలను దాటుకుంటూ పోతుంది; ఇలాంటి ప్రతీ దశలోనూ ప్రజల్లో కొంత భాగం టిక్కుమని ఆగిపోయి ఇక ముందడుగులో అడుగు కలపరు; వాస్తవానికి, పరస్పరం జీవన్మరణ పోరాటాన్ని సాగించే వివిధ పార్టీ గ్రూపులలో... "శ్రామికవర్గ సాంఘిభావం" ప్రతీ దశలోనూ ఎందుకు పటుతరమవుతుందో ఈ ఒక్క ఉదాహరణే వివరిస్తుంది." ["బెబెల్‌కు ఎంగెల్స్ రాసిన లేఖ" మార్క్స్-ఎంగెల్స్ సెలెక్టెడ్ కరస్పాండెన్స్. పేజీ: 347.]

సరిగ్గా ఈ పరిణామమే ఉత్పత్తిల్లింది. కమ్యూనిస్టు లీగ్, ఫస్ట్ ఇంటర్నేషనల్— ఇవన్నీ ఆదిలో సమైక్యంతో మెలగినవే. కాని ఈ సంస్థల అభివృద్ధి క్రమంలో అవి రెండు భిన్నమైన పోటీ శాఖలైనాయి. ప్రతీ దఫాకూ అవకాశవాదానికి, విచ్ఛిన్న చర్యలకు వ్యతిరేకంగా సాగే అంతర్జాతీయ కార్మికోద్యమాన్ని ఒక నూతన దశకు తీసుకుపోతూనే వుంది; సరికొత్త పునాదిపైన మరింత పటుతరమైన, మరింత ఎక్కువ పరిధిలో ఉండే ఐక్యతను నెలకొల్పడానికి దోహదం చేస్తూ వచ్చింది. సెకండ్ ఇంటర్నేషనల్‌లో మూర్తీభవించిన రివిజనిజానికీ, చీలికతత్వానికి వ్యతిరేకంగా సాగిన పోరాటంలో అక్టోబర్ మహావిప్లవ విజయమూ, థర్డ్ ఇంటర్నేషనల్ స్థాపనా ఘనవిజయాలు.

ఐక్యత, పోరాటం లేదా చివరకు చీలికలు, కొత్త పునాదిపై తిరిగి ఐక్యత— ఇదీ, అంతర్జాతీయ కార్మికోద్యమాభివృద్ధి యొక్క గతితర్కం.

# 2

# అనివార్యమయ్యే చీలిక

ప్రతీ దశలోనూ ఐక్యతా రక్షకులకూ, చీలికల సృష్టి కర్తలకూ మధ్యసాగే పోరాటం స్థూలంగా, మార్క్సిజం-లెనినిజానికీ, అవకాశవాదం రివిజనిజాలకూ మధ్య; మార్క్సిజాన్ని పరిరక్షించి నిలబెట్టేవారికీ, మార్క్సిజానికి ద్రోహం తలపెట్టిన వారికీ మధ్య సాగే పోరాటమేనని అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ చరిత్ర నిరూపిస్తోంది.

అంతర్జాతీయంగాగాని, వేర్వేరు దేశాలలోగాని నిజమైన శ్రామిక-

వర్గ ఐక్యత అనేది మార్క్సిజం-లెనినిజం ఆధారంగా మాత్రమే సాధ్య పడుతుంది.

అంతర్జాతీయంగానూ, వేర్వేరు దేశాలలోనూ ఎక్కడైనా అవకాశ వాదమూ, రివిజనిజమూ ముమ్మరంగా ఉన్నచోట శ్రామికవర్గ సభ్యులలో చీలిక అనివార్యమవుతుంది. కమ్యూనిస్టు ఉద్యమంలో వచ్చే ప్రతీ చీలికకూ మార్క్సిజం-లెనినిజాన్ని వ్యతిరేకించి దానికి ద్రోహం తలపెట్టే అవకాశ వాద-రివిజనిస్టులే తప్పనిసరిగా బాధ్యులవుతారు.

చీలికతత్వమంటే, మార్క్సిజం-లెనినిజంనుండి చీలిపోవడం. మార్క్సిజం-లెనినిజాన్ని వ్యతిరేకించి దానికి ద్రోహంచేసేవా రెవరైనా సరే, ఆ విధంగా శ్రామికవర్గ ఐక్యతా పునాదిని విచ్ఛిన్నపర్చే వారెవరైనా సరే అతడు విచ్ఛిన్నకుడి క్రింద లెక్క.

చీలికతత్వము అంటే అర్థం, విప్లవకర శ్రామికవర్గ పార్టీనుంచే వేరుపడ్డం. రివిజనిస్టు మార్గంలో మునిగి తేలుతూ విప్లవ శ్రామికవర్గ పార్టీని సంస్కరణవాద బూర్జువా పార్టీగా మార్చివేసే వాడెవడైనా సరే వాడు విచ్ఛిన్నకునిక్రింద లెఖ్క. →

అలాగే చీలికతత్వం అంటే అర్థం విప్లవకర శ్రామికవర్గంలోనూ, శ్రామిక ప్రజా బాహుళ్యంనుంచి వేరుపడ్డం. శ్రామికవర్గ, కార్మికవర్గ విప్లవ చైతన్యానికీ, వారి ప్రాథమిక ప్రయోజనాలకూ భిన్నంగా ఉన్న కార్యక్రమాన్ని, మార్గాన్ని చేపట్టిన వాడెవడైనా సరే వాడు విచ్ఛిన్నకుడి కింద లెఖ్క.

శ్రామికవర్గ ఐక్యతను విచ్ఛిన్న పర్చడంద్వారా చీలికతత్వం బూర్జువా ప్రయోజనాలకు వుపయోగపడి దాని అవసరాలను తీర్చుతుంది. శ్రామికవర్గ శ్రేణుల్లో చీలికలు కల్పించడానికి బూర్జువావర్గం నిరంతరం అనుసరించే విధానం ఇదే. అది (బూర్జువావర్గం) ఎంతటి క్రూరమైన పద్ధతికి దిగుతుందంటే, శ్రామికవర్గ శ్రేణుల్లో ఏజంట్లను కొనసైనా కొంటుంది,

లేదా అలాంటి వారిని తరిఫీదైనా చేస్తుంది. అవకాశవాదులు, రివిజనిస్టుల లాంటివారే సరిగ్గా బూర్జువావర్గ ఏజంట్లుకూడా. ఇంతవరకూ బూర్జువావర్గ వ్యతిరేక పోరాటంలో శ్రామికవర్గాన్ని సమైక్యపర్చే యత్నంనుండి మళ్ళి ఈ అవకాశవాదులు, రివిజనిస్టులు శ్రామికవర్గాన్ని బూర్జువావర్గంతో సహకరించమని కోరుతున్నారు. బెరన్‌స్టీన్, కాట్స్కీలాంటి సెకండ్ ఇంటర్నేషనల్ రివిజనిస్టులు చేసిన పనికూడా సరిగ్గా ఇదే. సామ్రాజ్యవాద యుద్ధాన్ని అంతర్యుద్ధాలుగా మార్చేందుకు అన్ని దేశాల శ్రామికవర్గమూ సమైక్యమవుతుందని సామ్రాజ్యవాదులు భయపడినప్పుడు ఈ రివిజనిస్టులు అంతర్జాతీయ కార్మికోద్యమంలో చీలిక తేవడానికి ముందుపీఠీన నిలబడ్డారు. శ్రామిక వర్గానికి, బూర్జువావర్గానికి మధ్య సహకారాన్ని ప్రబోధించజూదారు.

సెకండ్ ఇంటర్నేషనల్ రోజుల్లో బెర్న్‌స్టీన్, కాట్స్కీల నాయకత్వాన వున్న రివిజనిస్టులు మెజారిటీలో వున్నారు; లెనిన్ నాయకత్వాన వున్న మార్క్సిస్టులు మైనారిటీలో వున్నారు. అయినప్పటికీ బెరెన్‌స్టీన్, కాట్స్కీ తదితర అవకాశవాదులే విచ్ఛిన్నకులైనారుగాని లెనిన్‌లాంటి విప్లవ వాదులు మాత్రం కాదు

అలాగే 1904లో రష్యన్ సోషల్ డెమోక్రటిక్ లేబర్ పార్టీ కేంద్ర సంస్థల్లో అధికారాన్ని చేజిక్కించుకొని పైస్థానాల్లో వున్నప్పటికీ విచ్ఛిన్నకర పాత్రధారులు మెన్షివిక్‌లేగాని మరెవరూ కాదు. ఆ సందర్భంలో లెనిన్ ఇలా చెప్పారు:-

> "నాయకత్వ కేంద్రాలు [పార్టీ పత్రిక, కేంద్రకమిటీ, కేంద్రసమితి (కౌన్సిల్)] పార్టీతో "తెగతెంపులు చేసుకొన్నాయి" ...ఈ కేంద్రాలు వెళ్ళి పార్టీ "వెలుపల ఏర్పడ్డాయి." ఇందులో మధ్యేమార్గం అంటూ ఏదీలేదు. పార్టీ సభ్యులంతా, వుంటే ఆ కేంద్రాలతో వున్నారు. లేదా పార్టీతో వున్నారు."

("జూరిచ్ గ్రూపు బోల్షివిక్కులకు లెనిన్ రాసిన లేఖ" కలెక్టడ్ వర్క్స్: వాల్యూం 8; పేజీ 63-64)

క్లుప్తంగా చెప్పాలంటే, చీలికతత్వం యొక్క రాజకీయ, సిద్ధాంత వ్రేళ్ళు అవకాశవాదమూ, రివిజనిజమూ. అవకాశవాద, రివిజనిజాలు మూర్తీభవించిన నిర్మాణ (ఆర్గనైజేషనల్) రూపమే చీలికతత్వం. అంతే గాదు; అవకాశవాదమూ, రివిజనిజమూ అంటే చీలికతత్వమూ, ఒంటెత్తు వాదమూ (సెక్టేరియనిజమూ) అనికూడా చెప్పొచ్చు. రివిజనిస్టులు, కమ్యూనిస్టు ఉద్యమంలో అత్యంత క్రూరమైన విచ్ఛిన్నకులూ, సెక్టేరియన్లూ.

# 3

# అవకాశవాద వ్యతిరేక పోరాటమే ఐక్యతకోసం పోరాటం

అవకాశ వాదానికి, రివిజనిజానికి, చీలికతత్వానికి వ్యతిరేకంగా పోరాడ్డం ద్వారానే శ్రామికవర్గ ఐక్యత సుస్థిరమై ప్రవర్ధమానమైందని కూడా అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ చరిత్ర నిరూపిస్తోంది. ఐక్యత కోసం జరిపే పోరాటం, సిద్ధాంత సూత్రాలకోసం జరిపే పోరాటంనుంచి విడదీయరానిది.

శ్రామికవర్గం కోరుకొనే ఐక్యత, ఉమ్మడి శత్రువుకు వ్యతిరేకంగానూ, కమ్యూనిజమనే మహత్ లక్ష్యంకోసమూ అవసరమైన వర్గ ఐక్యత, విప్లవ ఐక్యత. అంతర్జాతీయ శ్రామికవర్గ ఐక్యతకు మార్క్సిజం-లెనినిజంలో సిద్ధాంత, రాజకీయ పునాది వుంది. ఎప్పుడైతే ఈ వర్గానికి సిద్ధాంత రాజకీయ ఐక్యత వుంటుందో అప్పుడు మాత్రమే ఈ వర్గానికి

[అంతర్జాతీయ శ్రామికవర్గం] పటిష్టవంతమైన నిర్మాణం వుంటుంది; కార్యాచరణలో ఐక్యతా వుంటుంది.

సిద్ధాంతాన్ని, మార్క్సిజం - లెనినిజం పవిత్రతనూ కాపాడి నిలబెట్టడంద్వారా మాత్రమే నిజమైన శ్రామికవర్గ విప్లవైక్యతను సాధించడం సాధ్యపడ్తుంది. సూత్రాలకు విడాకులిచ్చి, అవకాశ వాదులతో చేతులు కలిపి ఆ బురదలోపడి కొట్టుకోవడంద్వారా సాధించే ఐక్యత శ్రామికవర్గ ఐక్యత కానేరదు: మీదుమిక్కిలి అలాంటి ఐక్యతంటే లెనిన్ చెప్పినట్లుగా "ఆచరణలో జాతీయ బూర్జువావర్గంతో శ్రామికవర్గ ఐక్యత అనీ, తొత్తులందరి ఐక్యతనీ, విప్లవవాదుల మధ్య చీలిక అనీ అర్థం".

[కలెక్టెడ్ వర్క్స్: న్యూయార్క్ ప్రచురణ: వాల్యూం 18, పేజీ 329]

"కూలద్రోయనిదే బూర్జువావర్గం ఎలా అంతరించి పోదో" అలాగే బూర్జువావర్గం పెంచి పోషించి బలపర్చుతున్న అవకాశవాద ప్రవాహజాలును 'ఖతం' చేయకపోతే అంటే శ్రామికవర్గ ప్రజల్లో దీని ప్రతిప్రభావాన్ని తుడిచిపెట్టకపోతే అది దానంతటది అంతరించదు" అనికూడా లెనిన్ అన్నాడు. అందుకనే, "అవకాశవాద ప్రవాహానికి వ్యతిరేకంగా నిర్దాక్షిణ్యంగా పోరాడ్డం" అవసరమని లెనిన్ అన్నాడు.

మార్క్సిస్టు-లెనినిస్టు లందరినీ నేడు అవకాశవాద రివిజనిస్టుల సవాలు ఎదొర్కొంటోంది. ఈ అవకాశవాద రివిజనిస్టులు బరితెగించి అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమాన్ని చీల్చుతున్నారు. ఇట్టి సమయంలో మార్క్సిస్టు-లెనినిస్టు లంతా సిద్ధాంతసూత్రాల విషయంలో రాజీలకు దిగుకూడదు. కాని అదే సమయంలో కృతనిశ్చయంతో చీలికతత్వాన్ని ఎదుర్కోవాలి. ఇది, మార్క్స్ - ఎంగెల్స్ - లెనిన్ మహాశయులు మన కందించిన అమూల్యమైన ఆదేశం. అలాగే ఇది, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యతా పరిరక్షణకు సరైన ఏకైకమార్గం కూడా.

కృశ్చేవ్ నాయకత్వాన వున్న సోవియట్ కమ్యూనిస్టుపార్టీ నాయకులు నేడు, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో ఆధునిక రివిజనిజానికి ముఖ్యప్రతినిధులుగానే గాక ఉద్యమంలో పెద్ద విచ్ఛిన్నకులుగా మారారని కూడా ఇటీవలి సంవత్సరాల ఘటనలు నిరూపిస్తున్నాయి.

సోవియట్ పార్టీ 20 వ, 22 వ మహాసభల మధ్యకాలంలో సోవియట్ పార్టీ నాయకులు ఒక పరిపూర్ణమైన రివిజనిస్టు పద్ధతిని అభివృద్ధి చేసుకొంటూ వచ్చారు. వీరు శ్రామికవర్గ విప్లవానికీ, శ్రామికవర్గ నియంతృత్వానికీ విరుద్ధమైన రివిజనిస్టు పంథాను ప్రవేశ పెట్టారు ఈ పంథాలో "శాంతియుత సహజీవనం" వుంది, "శాంతియుత పోటీ" వుంది, "శాంతియుత పరివర్తన" గూర్చి వుంది. "యావన్మంది ప్రజల రాజ్యాంగ యంత్రం" అని వుంది; "యావన్మంది ప్రజలపార్టీ" అని వుంది. వీరు ఈ రివిజనిస్టు పంథాను, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ ఉమ్మడిపంథాకు భిన్నంగా ఇతర సోదర పార్టీలన్నింటిపైనా బలవంతాన రుద్దడానికి ప్రయత్నించారు (అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం ఆమోదించిన ఉమ్మడి పంథా 1957, 1960 నాటి మాస్కో సమావేశాల్లో రూపొందినదే). మార్క్సిస్టు - లెనినిస్టు పంథాను కాపాడగోరి, తమ రివిజనిస్టు పంథాను ప్రతిఘటించిన వారినల్లా సోవియట్ పార్టీ నాయకులు దుమ్మెత్తి పోశారు.

అసలు సోవియట్ పార్టీ నాయకులే అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యతా ప్రాతిపదికను దెబ్బతీశారు. మార్క్సిజం - లెనినిజానికి, శ్రామికవర్గ అంతర్జాతీయతకు ద్రోహం చేయడంద్వారా, తమ రివిజనిస్టు, చీలికతత్వ మార్గాన్ని త్వరత్వరగా ఆచరణలోకి తేవడంద్వారా నేడు చీలిక అనే తీవ్ర ప్రమాదానికి సృష్టికర్తలైనారు.

సోషలిస్టు శిబిరాన్ని సుస్థిరంచేసి, దాన్ని విస్తృతపర్చేందుకు శ్రమించడంపోయి సోవియట్ పార్టీ నాయకులు, దాన్ని చీల్చి విచ్ఛిన్నపర్చడానికి ప్రయత్నించారు. ఆ విధంగా వారు అద్వితీయమైన సోషలిస్టు శిబిరాన్ని అల్లకల్లోలం చేశారు.

23

# సోదరపార్టీలమధ్య సంబంధాల ఉల్లంఘన

అంతేగాదు; మాస్కో ప్రకటన, పత్రాల్లో సోదరపార్టీలమధ్య వుండాల్సిన సంబంధాల్ని గూర్చి పొందుపర్చిన సూత్రాలను సోవియట్ నాయకులు ఉల్లంఘించారు. సోదర సోషలిస్టు దేశాలపట్ల అగ్రరాజ్య దురహంకారాన్నీ, జాతీయ అహంభావ విధానాన్నీ అనుసరించారు: ఆ విధంగా సోషలిస్టు శిబిర ఐక్యతను విచ్ఛిన్నం చేశారు.

సోవియట్ పార్టీ నాయకులు, సోదరదేశాల సార్వభౌమాధికార హక్కులు నిరంకుశంగా హరించి, అంతరంగిక విషయాలలో జోక్యం కల్పించుకొన్నారు; విచ్ఛిన్నకర చర్యలను జరిపారు. ఆ విధంగా సోదర దేశాలను అదుపుచేయడానికి అన్ని మార్గాలనూ అనుసరించారు.

"అంతర్జాతీయ శ్రమశక్తి విభజన" పేరుతో సోవియట్ పార్టీ నాయకులు తమ స్వంత కృషితో సోషలిజాన్ని నిర్మించుకొని స్వంత కాళ్ళపై ఆధారపడి తమ ఆర్థికరంగాన్ని అభివృద్ధి చేసుకొనే విధానాన్ని సోదర దేశాలు అనుసరించకుండా వ్యతిరేకిస్తున్నారు. ఈ దేశాన్ని తమపై ఆధారపడే వాటినిగా వుంచేందుకు ప్రయత్నిస్తున్నారు. ఇతర్లతో పోల్చితే ఆర్థికంగా వెనుకబడివున్న సోదరదేశాలు పారిశ్రామికీకరణకు పూనుకోకుండా వాటిపై సోవియట్ నాయకులు వత్తిడిచేయ ప్రయత్నించారు; ఆ విధంగా ఈ సోదరదేశాలు సోవియట్‌కు ముడిసరుకుల సప్లయి కేంద్రాలుగా, తమ అదనపు సరుకులకు మార్కెట్లు వుపయోగపడేటట్లూ వత్తిడిచేయ ప్రయత్నించారు.

సోవియట్ నాయకులు తమ అగ్రరాజ్య దురహంకార విధానాన్ని అనుసరించడంలో నీతి నియమాలను లెక్కచేయనే లేదు. సోదరదేశాలపైన వీరు, నిరంతర రాజకీయార్థిక సైనిక వత్తిళ్ళను తీసుకువచ్చారు.

అల్బేనియాపార్టీ నాయకుల్ని, ఆ దేశ ప్రభుత్వ నాయకుల్ని కూల

ద్రోయండని సోవియట్ నాయకులు బహిరంగంగానే పిలుపు నిచ్చారు; ఆ దేశంతో ఆర్థిక, దౌత్య సంబంధా లన్నింటినీ తెంచేసుకున్నారు. వార్సా సంధి రాజ్యాల సంస్థ సభ్యరాజ్యంగా, "పరస్పర ఆర్థిక సహాయక సమితి" సభ్యరాలుగా అల్బేనియాకున్న న్యాయమైన హక్కులను నిరంకుశంగా హరించివేశారు.

సోవియట్ పార్టీ నాయకులు, "చైనా - సోవియట్ మైత్రీ, సహకార, పరస్పర సహాయక" ఒప్పందాన్ని ఉల్లంఘించారు: చైనాలో పనిచేస్తున్న 1390 మంది సోవియట్ నిపుణులను ఉపసంహరించుకొంటూ ఏకపక్ష నిర్ణయం తీసుకున్నారు. అలాగే నిపుణుల నియామకం విషయమై చైనాతో కుదుర్చుకొన్న 343 కంట్రాక్టులను, అనుబంధ కంట్రాక్టులనూ చైనా ప్రభుత్వంతో సంప్రదించకుండా ఏకపక్షంగా రద్దుచేయ నిర్ణయించారు; శాస్త్ర, సాంకేతిక సహకార సంబంధమైన 257 అగ్రిమెంట్లను ఏకపక్షంగా రద్దుచేసుకో నిర్ణయించారు; చైనాకు వ్యతిరేకంగా వివక్షాపూరితమైన నిర్బంధ వర్తక విధానాన్ని అనుసరించారు: చైనా - సోవియట్ సరిహద్దుల్లో ఘర్షణలు రెచ్చగొట్టారు; సింకియాంగ్‌లో పెద్దపెట్టున విద్రోహ చర్యలు సాగించారు; చివరకు ఒకథఫా కన్న ఎక్కువసార్లే కృశ్చేవ్, చైనా పార్టీలోని పార్టీ వ్యతిరేకశక్తులు కొన్ని తనకు "చాల మంచి స్నేహితులని" కూడా చైనా పార్టీ కేంద్రకమిటీ నాయకత్వ స్థానంలో వున్న ముఖ్యులకు చెప్పేంతవరకూ వెళ్ళాడు. సోషలిస్టు నిర్మాణం, పెద్ద ముందంజ విధానం (బిగ్‌లీప్ ఫార్వర్డ్) ప్రజాకమ్యూన్లు అనే చైనా పార్టీ జనరల్ పంథాను వ్యతిరేకించిన పార్టీ వ్యతిరేక శక్తుల్ని కృశ్చేవ్ పొగిడాడు. ఈ పార్టీ వ్యతిరేకుల చర్య "మానవతాచర్య" అన్నాడు;

ప్రభుత్వాలమధ్య సంబంధాలను ఇంతగా చెడగొట్టే ఈలాంటి చర్యలు పెట్టుబడిదారీ దేశాల మధ్య సహితం చాల అరుదు. కాని సోవియట్ పార్టీ నాయకులు, దిగ్భ్రాంతి గొలిపే ఈలాంటి దుడుకు చర్యలను

సోదర సోషలిస్టు దేశాలపట్ల పదేపదే అనుసరించారు అయినా వీరు, తాము శ్రామికవర్గ అంతర్జాతీయతకు నమ్మినబంటు"లమని చెప్పేలుతూనే వున్నారు. ఈ సందర్భంలో వీరిని మేమొకటి ప్రశ్నించదలచాం: ఈ మీ చర్యలన్నింటిలోనూ అవగింజంతన్నా అంతర్జాతీయత వుందా?

ఇక సోవియట్ పార్టీ నాయకుల అగ్రరాజ్య దురహంకారమూ, చీలికతత్వమూ సోదర పార్టీలపట్ల వారి వైఖరిలో అంతగానూ కొట్టొచ్చినట్లు కన్పిస్తుంది.

సోవియట్ పార్టీ 20 వ మహాసభ జరిగింది లగాయతూ ఆ పార్టీ నాయకులు, "వ్యక్తి పూజా" పద్ధతిని ఎదుర్కొనే మిషతో, తమ పంథాను అనుసరింపజేసేటట్లుగా ఇతర సోదరపార్టీల నాయకత్వాన్ని మార్చడానికి ప్రయత్నించారు. ఈనాటి వరకూ వీరు, ఐక్యతా పునఃస్థాపనకు ముందు "వ్యక్తిపూజా పద్ధతిని ఎదుర్కొనే" సమస్యను ఒక ముందు షరతుగా పెడుతున్నారు; అది ప్రతి కమ్యూనిస్టుపార్టీ తప్పనిసరిగా అనుసరించ వలసిన ఒక "సూత్రం" గానొక్కి చెపుతున్నారు.

[చూ: "అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యత- సంఘీభావం కోసం" అన్న ప్రావ్దావ్యాసం 1963 డిసెంబరు 6.]

మాస్కో ప్రకటన, పత్రాల్లో సోదర పార్టీల సంబంధాలపై రూపొందించిన సూత్రాలకు విరుద్ధంగా సోవియట్ పార్టీ నాయకులు, సోదరపార్టీల స్వతంత్ర సమాన ప్రతిపత్తిని విస్మరిస్తున్నారు; ఫ్యూడల్ సంబంధాలలో, కన్నెర్రజేసి కొడుకును అదిలించజూస్తాడు తండ్రి. అలాగే వీరు (సోవియట్ నాయకులు) అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంపై అలాంటి ఆధిపత్యాన్నే ఏర్పాటుచేయ జూస్తున్నారు. ఆ విధంగా సోదరపార్టీల మధ్య సంబంధాలను తండ్రీ_కొడుకుల మధ్య సంబంధాలుగా మార్చజూస్తున్నారు వీరు. కృశ్చేవ్ ఒక సోదరపార్టీని "చిలిపి కుర్రాడు"గానూ, తనను

మాత్రం "మాతృమూర్తి"గానూ చిత్రించుకొన్నాడు. ఆయన ఇలా చిత్రించడం ఒకసారికాదు, అనేకసార్లు. [చూ:—అమెరికా పత్రిక "లుక్" సంపాదకునికి కృశ్చేవ్ ఇచ్చిన ఇంటర్వ్యూ. సుప్రీం సోవియట్‌కు కృశ్చేవ్ రిపోర్టు—1962 డిసెంబర్ 12] ఆత్మస్తుతి అనే ప్యూడర్ మన స్తత్వంలో వున్న ఆయన, సిగ్గునుకూడా పూర్తిగా విడిచి పెట్టేశాడు.

సోదరపార్టీల మధ్య సమాలోచనలద్వారా ఏకాభిప్రాయానికి రావడమనే సూత్రాన్ని సోవియట్ పార్టీ నాయకులు పూర్తిగా వదలివేసి, అలవాటు కొద్దీ నియంతృత్వం నిర్ణయాలు చేయడానికి, ఇతర్లకు ఉత్తర్వులు ఇవ్వడానికి పూనుకొన్నారు. సోదర పార్టీలతో కుదుర్చుకొన్న సమిష్టి ఒప్పందాలను బాధ్యారారహితంగా బుట్టదాఖలు చేశారు; సోదరపార్టీ లన్నింటినీ ఉమ్మడిగా ఆందోళన పరచే ప్రధాన విషయాలపై తమకు తామై నిరంకుశ నిర్ణయాలు తీసుకొన్నారు; ఆ విధంగా ముందుగానే చేసుకొన్న నిర్ణయాలను సోదరపార్టీలపై రుద్దారు.

సోదరపార్టీలమధ్య విభేధాలను అంతర్గత పార్టీ సమాలోచనలద్వారా పరిష్కరించుకోవాలన్న సూత్రాన్ని సోవియట్‌పార్టీ నాయకులు ఉల్లంఘించారు; మార్క్సిజం-లెనినిజాన్ని కాపాడి గట్టిగా నిలబెడ్తున్న సోదర పార్టీలకు వ్యతిరేకంగా పెద్ద ఎత్తున బహిరంగ దాడులు చేశారు. ఇందుకుగాను వీరు మొదట్లో తమ పార్టీ మహాసభనూ, తరువాత ఇతర సోదర పార్టీల మహాసభలనూ వేదికలుగా వినియోగించారు.

# దౌత్య చదరంగంలో సోదరపార్టీలు పావులా?

సోవియట్‌పార్టీ నాయకులు, తమ దౌత్య చదరంగంలో సోదర పార్టీలను పావులుగా భావిస్తున్నారు. కృశ్చేవ్ మూడేడు ముందుకు

పోతాడు. బారెడు వెనక్కు వస్తాడు: ఇంతలో ప్రేలిపోతాడు, అంతలో చల్లబడ్తాడు. ఈవేళ ఒకటంటాడు, రేపు మరొకటంటాడు. తానెక్కడి నుంచి ఎక్కడికి పోతాడో ఆయనకే తెలియదు. అయినా తానుచేసే ప్రతి దానికీ వంత పాడమంటూ సోదరపార్టీలపై వత్తిడి చేస్తాడు.

సోదరపార్టీలలో నాయకత్వంపై దాడిచేసో, లేక ఆ యా పార్టీల నాయకత్వ స్థానాలను చేజిక్కించుకోడానికి మార్క్సిస్టు-లెనినిస్టులను వెన్నంటటానికి, చివరకు పార్టీనుంచి వారిని తొలగించేందుకూ సోవియట్ పార్టీ నాయకులు ఈ పార్టీలలో తమ రివిజనిస్టు పంథాకు అనుకూలమైన వారిని ప్రోత్సహింటారు. ఆ విధంగా వారు ఆ పార్టీలలో చిక్కులు కల్పించి చీలికలు సృష్టించారు. సోవియట్ పార్టీ నాయకులు అనుసరించిన ఈ చీలిక తత్వం అనేక పెట్టుబడిదారీ దేశాల్లోని సోదర పార్టీలలో నిర్మాణం చీలు మార్గం పట్టడానికి దోహదం చేసింది.

ఆదిలో సోదరపార్టీల ఉమ్మడి పత్రికగా నడుస్తూన్న "ప్రాబ్లెమ్సు ఆఫ్ పీస్ అండ్ సోషలిజం" ["శాంతి-సోషలిజం సమస్యలు"]ను రివిజనిజం, సెక్టేరియనిజం వ్యాప్తికి, చీలికతత్వ వ్యాప్తికి సాధనంగా మార్చివేశారు; సంయుక్త సమావేశంలో స్థాపితమైన ఈ పత్రికను, ఆ సమావేశ ఉమ్మడి ఒప్పందానికి విరుద్ధంగా మార్క్సిస్ట్-లెనినిస్టు సోదరపార్టీలపై నీతి బాహ్యమైన దాడులు జరిపేందుకూ వినియోగిస్తున్నారు.

వాటికితోడు సోవియట్‌పార్టీ నాయకులు, అంతర్జాతీయ ప్రజాతంత్ర సంస్థలపైన తమ రివిజనిస్టు పంథాను రుద్దుతున్నారు! ఈ సంస్థలు ఇంతకుముందు చేపట్టిన సత్పంథాను తారుమారు చేస్తున్నారు; ఈ సంస్థలలో ఈ విధంగా చీలికలు కల్పిస్తున్నారు.

సోవియట్ పార్టీ నాయకులు శత్రువులను మిత్రులుగాను, మిత్రుల్ని శత్రువులుగాను పూర్తిగా తారుమారు చేశారు. అమెరికన్ సామ్రాజ్యవాదం

పైనా, దాని గులాములపైనా సాగాల్సిన పోరాటపు వాడిని వారు, మార్క్సిస్టు-లెనినిస్టు సోదరపార్టీల పైకి తిప్పారు.

ప్రపంచాన్ని తమ చెప్పుచేతల్లో వుంచుకోడానికి సోవియట్-అమెరికా సహకారావకాశాల్ని గూర్చి సోవియట్ పార్టీ నాయకులు వెతుకులాడుతున్నారు; ప్రపంచ ప్రజలందరి ఉమ్మడి దుష్టశత్రువైన అమెరికన్ సామ్రాజ్యవాదాన్ని వారు, తమ కత్యంత విశ్వసనీయ మిత్రునిగా భావించుకొంటున్నారు; మరోవైపున మార్క్సిజం-లెనినిజానికి కట్టుబడివున్న సోదరపార్టీలను, దేశాలను తమ శత్రువర్గంగా జమకడుతున్నారు. సోషలిస్టు సోదర దేశాలకూ, సోదరపార్టీలకూ, మార్క్సిస్టు-లెనినిస్టులకూ సమస్త దేశాలలోని విప్లవ ప్రజానీకానికీ వ్యతిరేకంగా సోవియట్ పార్టీ నాయకులు, అమెరికన్ సామ్రాజ్యవాదంతోనూ, వివిధదేశాల అభివృద్ధి నిరోధక శక్తులతోనూ, విద్రోహి టిటో ముఠాతోనూ, మితవాద సోషల్ డెమోక్రట్లతోనూ చేతులు కలుపుతున్నారు.

ఐసెన్‌హోవర్ నోటినుంచో, లేక కెన్నెడీ నోటినుంచో లేక ఆలాంటివారి నోటినుంచో ఏమి వూడిపడుతుందో దాన్ని గడ్డిపోచలా పట్టుకొందామని ఎదురు చూస్తారు (సోవియట్ నాయకులు. "లేక" సామ్రాజ్యవాదులకు ఇబ్బందిలేకుండా కాలం గడిచిపోతున్నదని భావించినప్పుడూ సోవియట్ నాయకులు ఆనంద పరవశులై పోతారు. ఆ పరవశత్వంలో వారు మార్క్సిజం_లెనినిజాన్ని అంటిపెట్టుకొనివున్న సోదర పార్టీలనూ, దేశాలనూ దెబ్బతీయజూస్తున్నారు; ఆ విధంగా అమెరికన్ సామ్రాజ్యవాదంతో తాము కుదుర్చుకున్న రాజకీయ లాలూచీలకు సోదర పార్టీలనూ, సోదర సోషలిస్టు దేశాలనూ బలిఇవ్వ ప్రయత్నిస్తున్నారు.

# తమ తప్పుడు విధానాలు విఫలమైనప్పుడు...

తమ తప్పుడు విధానాలు విఫలమై, తాము చిక్కుల్లోవున్నా మను కున్నప్పుడు సోవియట్ పార్టీ నాయకులు ఎప్పటికంటే కూడా యెక్కువ ముక్కోపులైపోతారు; ముఖాలు కందగడ్డలు చేసుకొంటారు. అప్పుడు మళ్ళీ విరుచుకుపడుతారు. మార్క్సిజం, లెనినిజానికి కట్టుబడివున్న సోదర పార్టీలపైనా, సోదర దేశాలపైనా; ఆ విధంగా వారు తమ తప్పిదాలకు ఇతర్లను నిందిస్తూ చేస్తారు.

ఈ వాస్తవాలన్నీ ఏం తెలియజేస్తున్నాయి? సోవియట్ ప్రజా ప్రయోజనాలకు విరుద్ధంగా సోషలిస్టు శిబిర, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ సకల విప్లవశక్తుల ప్రయోజనాలకు విరుద్ధంగా సోవియట్ పార్టీ నాయకులు శ్రామికవర్గ అంతర్జాతీయతకు పూర్తి ద్రోహమార్గాన్ని చేపట్టారు.

సోవియట్ పార్టీ నాయకులు తమ రివిజనిజాన్ని మార్క్సిజం-లెనినిజానికి పోటీగా పెడుతున్నారనీ, తమ అగ్రరాజ్య దురహంకారాన్ని, జాతి అహంభావాన్ని, శ్రామికవర్గ అంతర్జాతీయతకు పోటీ పెడుతున్నారనీ తమ సెక్టేరియనిజాన్ని, చీలికతత్వాన్ని శ్రామికవర్గ అంతర్జాతీయ ఐక్యతకు పోటీ పెడుతున్నారనీ, పై వాస్తవాలు స్పష్టంగా రుజువు చేస్తున్నాయి. ఆ విధంగా గతంలోని అవకాశవాదులవలెనే, సోవియట్ పార్టీ నాయకులుకూడా అనేక సోదర పార్టీలలో సోషలిస్టు శిబిరంలో మొత్తం అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలోనే చీలికలకు సృష్టికర్తలుగా మారారు.

సోవియట్ పార్టీ నాయకులు అనుసరిస్తున్న రివిజనిజమూ, చీలికత్వమూ, భూత వర్తమాన కాలాల్లోని ఏ ఇతర అవకాశవాదులూ, విచ్ఛిన్నకులూ చేపట్టిన మార్గంకన్నా ఎక్కువ ప్రమాదకరమైనది. లెనిన్ చే స్థాపించబడి, కమ్యూనిస్టుపార్టీ లన్నింటిమధ్యా అత్యుత్తమ గౌరవ మర్యా

దలతో తలమానికంగా ఎంచబడ్డ సోవియట్ కమ్యూనిస్టు పార్టీలో ఈ రివిజనిజం తలెత్తుతోందని ప్రతివారికీ తెలుసు; ఈ జాడ్యం, ప్రప్రథమ సోషలిస్టు దేశమైన సోవియట్ యూనియన్‌లో తల సూపుతోందన్నదీ ప్రతిఒక్కరికీ తెలుసు. అనేక సంవత్సరాలపాటు మార్క్సిస్టు-లెనినిస్టులూ, ప్రపంచంలోని విప్లవ ప్రజాశక్తులూ సోవియట్‌పార్టీని ఎంతో గౌరవంతో చూశారు. సోవియట్ యూనియన్‌ను ప్రపంచ విప్లవ వేదికగా భావించు కున్నారు; పోరాటానికి దాన్నొక ఆదర్శప్రాయ కేంద్రంగాఎంచుకున్నారు. సోవియట్‌పార్టీ ప్రస్తుత నాయకత్వం, తమ రివిజనిజాన్ని, చీలిక తత్వ సారాన్ని మూసిపెట్టుకొని, ఇప్పటికీ ఇంకా వాస్తవం తెలియనివారిని మోసగించేందుకుగాను, లెనిన్ సృష్టించినపార్టీ ప్రతిష్టనూ, ప్రథమ సోష లిస్టు రాజ్యప్రతిపత్తినీ స్వార్థానికి వినియోగించుకొంటున్నారు. అదే సమ యంలో వీరు-రెండు నాల్కల ధోరణిలో అందెవేసిన నిపుణులైన వీరు-ఒకవైపున ఆచరణలో చీలుమార్గంలో మునిగి తేలుతూనే మరోవైపున "ఐక్యత, ఐక్యత" అంటూ కేకలు పెడుతున్నారు. కొంతమేరకు వీరి చిట్కాలు తాత్కాలికంగా ప్రజల్ని గందరగోళ పర్చుతాయి. ఏమంటే, సోవియట్‌పార్టీపై సంప్రదాయంగా వస్తున్న విశ్వాసంవల్లా, వాస్తవాలు తెలుసుకోలేకపోవడం వల్లా కొంతమంది -గణనీయమైన సంఖ్యలోనే - సోవియట్‌పార్టీ నాయకులు చేపట్టిన రివిజనిజాన్ని, చీలికతత్వాన్ని గమ నించలేకపోతున్నారు.

ప్రపంచ వ్యాపిత ప్రభావంగల ఒక మహా సోషలిస్టు దేశంలో సోవియట్‌పార్టీ నాయకులు రాజ్యాంగ యంత్రాన్ని నడుపుతున్నందువల్ల, వారు చేపట్టిన రివిజనిస్టు చీలిక తత్వపంథా అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమానికీ, ప్రపంచ విప్లవ శ్రామికవర్గ ప్రయోజనానికీ గతంలో ఏ యితర అవకాశవాదులూ, విచ్ఛిన్నకులూ చేయనంతటి పెద్ది హాని చేకూర్చింది.

చరిత్రకు తెలిసిన రివిజనిస్టులు, సెక్టేరియన్లూ, విచ్ఛిన్నకు లందరి కన్నా సోవియటుపార్టీ నాయకులే పెద్ద రివిజనిస్టులూ, సెక్టేరియన్లు, విచ్ఛిన్నకులూనని చెప్పొచ్చు.

సోవియట్ పార్టీ నాయకుల రివిజనిజమూ, చీలుబాటల తత్వమూ అంతర్జాతీయంగా రివిజనిస్టు మహాప్రవాహవ్యాప్తికి ఎంతగానో సాయపడింది; ఆ విధంగా సామ్రాజ్యవాదానికీ, సకలదేశాల్లోని అభివృద్ధి నిరోధక శక్తులకూ అపారమైన సేవచేసి పెట్టిందనేది యిప్పటికే స్పష్టమైపోయింది.

సోవియటుపార్టీ నాయకులు రివిజనిజాన్నీ, చీలికత్వాన్నీ చేపట్ట డానికి కారణం:- సోవియట్ యూనియన్ లోపల బూర్జువాభావశక్తులు పుట్టగొడుగుల్లా అభివృద్ధికావడమూ, సామ్రాజ్యవాద విధానప్రభావం పెరగడమూ, ముఖ్యంగా అణ్వస్త్రాలుచూసి బెదిరించే సామ్రాజ్యవాద విధాన ప్రభావమూ, "శాంతియుత పరివర్తన" అనే విధానప్రభావమూ పెరగడం, వీటి పర్యవసానమే సోవియట్ పార్టీ నాయకులు రివిజనిజాన్నీ చీలిక తత్వాన్నీ చేపట్టడం. దీని ఫలితం. అంటే రివిజనిస్టు చీలికతత్వ సిద్ధాంతమూ, విధానాలు దేశంలో పెట్టుబడిదారీ శక్తులు పరివ్యాప్తం కావడానికి దోహదపడ్డమేగాక, సామ్రాజ్యవాదానికి కూడా సేవచేసిపెట్టి ప్రజల విప్లవశక్తిని స్తంభింప జేసి, ప్రపంచ ప్రజల విప్లవ పోరాటాన్ని అడ్డుకానేందుకు దోహదపడ్డం.

వాస్తవానికి సోవియట్ కమ్యూనిస్టుపార్టీ నాయకులు సామ్రాజ్యవాదులనుంచీ, వారి గులాములనుంచీ మన్ననలూ, పొగడ్తలు పొందారు.

# కృశ్చేవ్ విచ్ఛిన్న కార్యకలాపాలు

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో ముఖ్యంగా విచ్ఛిన్న చర్యలకు పూనుకొన్నందుననే కృశ్చేవ్‌ను అమెరికా సామ్రాజ్యవాదులు

స్తుతిస్తున్నది. సామ్రాజ్యవాదు లంటున్నారుగదా "పశ్చిమ రాజ్యాలతో ఉద్రిక్తత సడలించుకోవాలని కృశ్చేవ్ తగినంత చిత్తశుద్ధికోనే కోరు తున్నాడని స్పష్టమైంది. ఇందుకుగాను అతడు ఈ లక్ష్యాన్ని సాధించేందుకు కమ్యూనిస్టు ఉద్యమంలో చీలికకు కూడా సిద్ధపడగోరుతున్నాడు".

(చూ: "దౌత్య మార్గాలు : శిబిరాలలో పగుళ్ళు" - "ది నేషన్" పత్రిక : 1963 ఫిబ్రవరి 9.)

"స్టాలిన్ రోజుల్లో ఒక్కత్రాటిపై నడచిన ఐక్యఉద్యమాన్ని మళ్ళి గుక్క తిప్పుకో లేనంతగా నాశనం చేశాడు. నికిటా కృశ్చేవ్. దీనితో బహుశా గొప్ప సేవచేశాడు. ఎవరికి? కమ్యూ నిజాన్నికి కాదుసుమా, పశ్చిమరాజ్య ప్రపంచానికి!"

("మాస్కో - పెకింగ్ : ఈ చీలిక ఎంత లోతుంది?" "న్యూస్ వీక్" పత్రిక : 1962 మార్చి 26)

"చైనా వాళ్ళతో తనకున్న సంబంధాలను కృశ్చేవ్ చెడ గొట్టుకున్నందుకు మనం కృతజ్ఞత తెల్పాలి...తనకు తోచిందే తడవుగా, అతిచొరవతో తీసుకున్న అనేక చర్యం మూలంగా అతను అంతర్జాతీయ కమ్యూనిజంలో నానా గందరగోళం ప్రవేశ పెడుతున్నాడు. ఇందుకూ మనం కృతజ్ఞత తెల్పాలి."

["అణుపరీక్షల పాక్షిక ఒప్పందంతో కృశ్చేవ్ తన పద్ధతుల్ని మార్చుకున్నాడా?"— "అమెరికన్ న్యూస్ అండ్ వరల్డ్ రిపోర్టు" 1963 సెప్టెంబర్ 30]

అంతేగాదు, "పశ్చిమరాజ్యాలు నమ్మకంతో వ్యవహరించదగ్గ మంచివాడు సోవియట్ ప్రధాని...అతని ఉనికిని మరింత బలహీనపర్చే ఏ చర్యా జరక్కుండా పశ్చిమరాజ్యాలు ప్రస్తుతానికి ప్రయత్నించాలి" అని కూడ సామ్రాజ్యవాదులు గట్టిగా అభిప్రాయపడ్తున్నారు.

["ఇక కమ్యూనిస్టు ఐక్యత అనేది పాతపుణ్యంకిందే అమెరికాలో లెక్క"— "లండన్ టైమ్స్ పత్రిక:" 1962 జనవరి 17]

అంతేగాదు, సామ్రాజ్యవాదులు యింకా అంటారుగదా:

"ఎర్రచైనాతో కృశ్చేవ్‌కున్న వివాదం విషయంలో అతడికి సాధ్యమైనంత ఎక్కువ సహకారాన్ని అమెరికా అందివ్వాలని అమెరికా ప్రభుత్వానికిప్పుడు నమ్మకం చిక్కింది."

( "ది పెరిస్కోప్," న్యూస్‌వీక్ పత్రిక, 1963 జూలై 1 )

ఇక చాలాకాలంగా, రాజకీయంగా దివాళాకోరులుగా వుండిపోయిన ట్రాట్స్కీయిస్టులు కూడా సోవియట్ పార్టీ నాయకులకు స్తోత్రపాఠాలు వల్లించేవారిలో వున్నారు. స్టాలిన్‌పట్ల, అమెరికన్ సామ్రాజ్యవాదంపట్ల, యుగోస్లావియా రివిజనిస్టులపట్లా ఎటువంటి వైఖరి తీసుకోవాలన్న విషయంలో ట్రాట్స్కీయిస్టులు సోవియట్ పార్టీ నాయకుల్ని బలపరుస్తారు. ట్రాట్స్కీయిస్టులు అంటున్నారుగదా :

"సోవియట్ పార్టీ 20వ మహాసభ సృష్టించిన పరిస్థితీ, ఇంకా 20వ మహాసభ కల్పించిన పరిస్థితీ కార్మిక రాజ్యాలలోనే మన ఉద్యమ పునరుజ్జీవనానికి బాగా అనుకూలమైనది. ["అంతర్జాతీయ సంస్కృతి- మన కర్తవ్యాలు"; 1963 జూన్‌లో ఫోర్త్ (నాల్గవ) ఇంటర్నేషనల్" అంటూ ట్రాట్స్కీయిస్టులు జరిపిన పునరైక్యతా మహాసభ. "ఫోర్త్ ఇంటర్నేషనల్" పత్రిక సం. 17, 1961 అక్టోబర్ - డిసెంబర్, పేజీ, 47.)

"ఇందుకోసం మనం [ట్రాట్స్కీయిస్టుల-సం॥] పాతిక సంవత్సరాలకు పైగా ప్రయత్నాలు చేశాం ఇప్పుడు మనం చొరవతీసుకొని, శక్తియుక్తులన్నిటినీ కూడగట్టుకొని ముందుకు సాగాలి."

[1956 ఏప్రిల్ 1' - 15 తేదీల్లో అమెరికా ట్రాట్స్కీయిస్టు సోషలిస్టు వర్కర్సుపార్టీ," జాతీయ కమిటీ సమావేశం ఆమోదించిన "రష్యన్ విప్లవ నూతనదశ: సంక్షోభంలోపడ్డ స్టాలినిజం" అన్న తీర్మానం. 1957లో

5)

లండన్‌లోని న్యూయార్క్ పబ్లికేషన్ లిమిటెడ్‌వారు ప్రచురించిన "సోవియట్‌పార్టీ 20వ కాంగ్రెస్ : ప్రపంచ ట్రాట్స్కీయిజం" నుండి పేజీ,36.)

అంతేగాదు; "కృశ్చేవ్ ధోరణి దృష్ట్యా మనం, యింకా అనేక ఛాందస ధోరణులకు... వ్యతిరేకంగా స్టాలిన్‌పట్ల విద్వేషాన్ని రెచ్చగొట్టడంలో కృశ్చేవ్ జరిపే పోరాటానికి విమర్శనాత్మకమైన సహకారం యిస్తాం." (1961 డిసెంబరు 5న ఫోర్త్ ఇంటర్నేషనల్ అనే పేరుతో ట్రాట్స్కీయిస్టుల అంతర్జాతీయ కార్యదర్శివర్గం ఆమోదించిన "సోవియట్ పార్టీ 20 వ మహాసభ ఫలితాలు" అన్న తీర్మానం. "ఫోర్త్ ఇంటర్నేషనల్" పత్రికనుంచి; నం 14, 1961-62, పేజీ, 25.)

ఒక్కసారి పరిశీలించండి : విప్లవ వ్యతిరేకులంతా ఎంత తొందరగా సోవియట్‌పార్టీ నాయకులను బలపరుస్తారో చూడండి. దీనికి కారణం ఏమిటంటారు? మార్క్సిజం -లెనినిజం పట్ల ప్రపంచవిప్లవంపట్ల తామనుసరించే దృక్పధానికీ, సోవియట్‌పార్టీ నాయకుల దృక్పధానికీ తేడాలేదనివారు గుర్తించినందువల్లనూ, సోవియట్‌పార్టీ నాయకుల రివిజనిస్టు - చీలిక పంథా అమెరికన్ సామ్రాజ్యవాద విప్లవ ప్రతిఘాతుకావసరాలను తీర్చుతున్నందువల్లనే.

## లెనిన్ చెప్పినట్లు మంచి కవచధారులు

లెనిన్ చెప్పినట్లు "కార్మికోద్యమంలో చురుకుగావుంటూ అవకాశవాద ధోరణిని అంటకాగుతున్నవారే, బూర్జువావర్గంకంటే కూడా ఆ వర్గానికి మంచి రక్షకులుగా వుంటార"న్న సంగతి బూర్జువా వర్గానికి తెలుసు.

[లెనిన్ సెలక్టెడ్ వర్క్స్, న్యూయార్క్ ఎడిషన్: వాల్యూం 10. పేజీ 196]

శ్రామికవర్గ ప్రపంచ విప్లవ లక్ష్య విధ్వంసనానికి సోవియట్ కమ్యూనిస్టుపార్టీ నాయకులు మార్గాన్ని సుగమం చేస్తూంటే సామ్రాజ్యవాద పెత్తందార్లు బహూ సంబరపడుతున్నారు.

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో తీవ్రస్వభావంగల ప్రమాదకర చీలికను తెచ్చిపెట్టిన సోవియట్ పార్టీ నాయకులు, ఆ నిందను ఇతర్లపై మోపడానికి ప్రయత్నిస్తున్నారు; చైనా కమ్యూనిస్టుపార్టీ తదితర మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీలే "చీలికతత్వ" నేరస్థులనీ, "సెక్టేరియన్" వాదులనీ, ఇంకా ఇలాంటి అనేకానేక ఆరోపణలు సృష్టిస్తూ నిందలు మోప జూస్తున్నారు.

ఈ సందర్భంగా మేము, వీరి ప్రధాన ఆరోపణల్లో కొన్నింటిని తీసుకొని ఒక్కొక్కదాన్ని వివరించి పూర్వపక్షం చేయడం అవసరమని భావిస్తున్నాం.

## రివిజనిజాన్ని విమర్శించడమే సోవియట్ వ్యతిరేకత అవుతుందా?

తమ రివిజనిస్టు ధోరణినీ, చీలికతత్వాన్ని ఎదుర్కొని విమర్శించిన వారి నందరినీ సోవియట్ పార్టీ నాయకులు, సోవియట్ వ్యతిరేకులని ఆరోపిస్తున్నారు. ఇది చాల ఘోరమైన ఆరోపణ. ప్రపంచంలో ప్రప్రథమ సోషలిస్టు దేశాన్ని, మహామనిషి లెనిన్ స్థాపించిన పార్టీని వ్యతిరేకించడమా— ఎంత తలబిరుసుతనం?

కాని, దొంగనాటకమాడవద్దని మాత్రం సోవియట్ పార్టీ నాయకులకు సలహా యిస్తున్నాం. సోవియట్ వ్యతిరేకులమనే ఆరోపణ మాకెన్నటికీ వర్తించదు.

అలాగే, ఆత్మస్తుతితో మత్తిల్లిపోకండని కూడా సోవియట్ పార్టీ నాయకులకు సలహా యిస్తున్నాం. సోవియట్ వ్యతిరేకులనే ఆరోపణతో మార్క్సిస్టు-లెనినిస్టుల నోరును ఎన్నటికీ మూయించలేరు.

సోవియట్ మహాప్రజలంటేనూ, సోవియట్ ప్రభుత్వ మంటేనూ, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ అంటేనూ, ప్రపంచంలోని కమ్యూనిస్టులందరి మాదిరే విప్లవ ప్రజాశక్తు లన్నింటి వలెనే చైనా కమ్యూనిస్టులు కూడా ఎప్పుడూ మనఃపూర్వకంగా ప్రేమానురాగాల్ని, గౌరవభావాన్ని ప్రదర్శిస్తూనేవున్నారు. ఎంచేతనంటే, లెనిన్‌పార్టీ నాయకత్వాన అక్టోబరు మహా విప్లవ విజయ దీపికను వెలిగించింది సోవియట్ మహాప్రజలే; ప్రపంచ శ్రామిక విప్లవ నూతన శకారంభానికి శ్రీకారం చుట్టిందీ వారే. ఆ తరువాత సంవత్సరాలతో కమ్యూనిజం పథంవైపు ప్రయాణం కట్టిన ఆద్యులూ వారే. లెనిన్ - స్టాలిన్‌ల నాయకత్వాన దేశీయ, అంతర్జాతీయ విషయాలలో మార్క్సిస్టు - లెనినిస్టు విధానాన్ని అనుసరించింది సోవియట్ కమ్యూనిస్టుపార్టీ, సోవియట్ ప్రభుత్వమూ. అలాగే ఈ పార్టీ సోషలిస్టు మహానిర్మాణంలో అంతకుముందు కని విని ఎరుగని ఘన విజయాలను సాధించింది; ఫాసిజానికి వ్యతిరేకంగా సాగిన యుద్ధంలో విజయ సాధనకు ఎంతగానో దోహదపడింది. సకల దేశాలలోని శ్రామికజన, కార్మికవర్గ విప్లవ పోరాటాలకు అంతర్జాతీయ సహకారాన్ని అందజేసింది

ఇక కొద్దికాలంలో చనిపోతాననగా స్టాలిన్ చెప్పాడు :

"...మనపార్టీ ధైర్యస్థయిర్యాలనూ, విజయాన్నీ చూచి పొంగిపోయిన సోదరపార్టీల ప్రతినిధులు, మనపార్టీకి ప్రపంచ విప్లవ - కార్మికోద్యమ "అగ్రగామిదళం" అని బిరుదు ప్రదానం చేశారు. ఈ బిరుదు ఇవ్వడము ద్వారా వారు "అగ్రగామిదళ" విజయాలు పెట్టుబడిదారీ శృంఖాలలో కృంగిపోతున్న ప్రజల దుస్థితిని తొలగించేందుకు సాయపడుతుందనే ఆశాభావాన్ని వెలిబుచ్చుతున్నారు. మనపార్టీ ఈ ఆశల్ని సఫలంచేసిందనే నేను భావిస్తున్నాను..."

(సోవియట్‌పార్టీ 10 వ మహాసభలో ఉపన్యాసం : మాస్కో ప్రచురణ : 1952, పేజీ 9.)

లెనిన్ నిర్మించిన సోవియట్‌పార్టీ కమ్యూనిస్టులందరి ఆశలను సఫలం చేసిందని స్టాలిన్ సరిగానే చెప్పాడు. లెనిన్ నిర్మించిన పార్టీ, శ్లాఘనీయమైన పార్టీ. చైనా కమ్యూనిస్టుపార్టీతో సహా అన్ని సోదరపార్టీల సహాయ సహకారాలకు సోవియట్‌పార్టీ పాత్రురాలే.

కాని, సోవియట్‌పార్టీ 20 వ మహాసభతో మొదలుపెట్టి కృశ్చేవ్ నాయకత్వానవున్న ప్రస్తుత సోవియట్‌పార్టీ నాయకత్వం స్టాలిన్‌పై తీవ్ర మైన దుమారం ప్రారంభించి, రివిజనిజం మార్గాన్ని అనుసరిస్తుంది. ఈ నాయకత్వం కమ్యూనిస్టులందరి ఆశలను సఫలంచేసిందని చెప్పగలమా? లేదు, అలా చెప్పలేం.

చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ రాసిన "అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ సాధారణ పంథాకు సంబంధించి ఒక సూచన" అన్న వ్యాసంలో, సోషలిస్టు శిబిరంలోని కమ్యూనిస్టు పార్టీలన్నీ ఈ క్రింది కర్తవ్యాలకు కట్టుబడివుండాలని సోషలిస్టు శిబిర దేశాల ప్రజల, అంతర్జాతీయ శ్రామిక వర్గ కార్మికవర్గ ప్రజల ఉమ్మడి డిమాండ్ అని చెప్పింది.

—సోషలిస్టు శిబిరంలోని కమ్యూనిస్టుపార్టీలన్నీ మార్క్సిస్టు-లెనినిస్టు పంథాకు కట్టుబడి వుండి, జాతీయ అంతర్జాతీయ విషయాలలో సరైన మార్క్సిస్టు-లెనినిస్టు విధానాలను అనుసరించాలి.

—శ్రామికవర్గ నాయకత్వాన శ్రామికవర్గ నియంతృత్వాన్ని కార్మిక-రైతాంగ సఖ్యతనూ సుస్థిరం చేయాలి! ఆర్థిక-రాజకీయ-సైద్ధాంతిక రంగాలలో సోషలిస్టు విప్లవాన్ని తుదకంటా ముందుకు తీసుకు పోవాలి.

—ప్రజా బాహుళ్యపు చొరవనూ, సృజనాత్మక శక్తినీ ఇతోధిక పరిచి, ప్రణాళికా బద్ధంగా సోషలిస్టు నిర్మాణాన్ని కొనసాగించి ఉత్పత్తిని అభివృద్ధిచేసి, ప్రజల జీవనస్థాయిని అభివృద్ధి పరచాలి; జాతీయ రక్షణ పాటవాన్ని బలోపేతం చేయాలి.

—మార్క్సిజం-లెనినిజం ఆధారంగా సోషలిస్టు శిబిర ఐక్యతను ఇతోధిక పర్చాలి; శ్రామికవర్గ అంతర్జాతీయత పునాదిగా ఇతర సోషలిస్టు దేశాలకు సహకరించాలి.

—సామ్రాజ్యవాదుల దురాక్రమణ; యుద్ధ విధానాలను వ్యతిరేకించాలి; ప్రపంచ శాంతిని పరిరక్షించాలి.

—అన్ని దేశాలలోని అభివృద్ధి నిరోధక శక్తుల కమ్యూనిస్టు వ్యతిరేక-ప్రజావ్యతిరేక-విప్లవ ప్రతీఘాతక విధానాలను వ్యతిరేకించాలి.

—ప్రపంచంలోని పీడితవర్గాల, పీడిత దేశాల విప్లవ పోరాటాలకు సాయపడాలి.

అంతేగాదు, "ఈ డిమాండ్లను నెరవేర్చడం తమ దేశాల ప్రజల, అంతర్జాతీయ శ్రామికవర్గ, కార్మికవర్గ ప్రజల కర్తవ్యంగా" సోషలిస్టు శిబిరంలోని కమ్యూనిస్టు పార్టీలన్నీ ఎంచుకోవాలని కూడా అని వ్యాసంలో వుంది.

అయితే ఇందుకు మారుగా సోవియట్ పార్టీ నాయకులు ఈ డిమాండ్లను వదిలేశారు. సోదర పార్టీల ఆశలకు ఆశాభంగం కల్పించారు; రివిజనిస్టు విచ్ఛిన్నపంథాను చేపట్టారు. వీరి యీ ప్రవర్తన, అంతర్జాతీయ శ్రామికవర్గ ప్రయోజనాల్ని కాలదన్నడం మాత్రమేగాదు; ఇది సోవియట్ పార్టీ, సోవియట్ ప్రభుత్వ, సోవియట్ ప్రజల ప్రయోజనాల్నే కాలదన్నడం.

# సోవియట్ ప్రభుత్వమూ, వ్యవస్థా అంధకారమైనవా?

కృశ్చేవ్ నాయకత్వానవున్న సోవియట్ కమ్యూనిస్టుపార్టీ నాయకులకన్నా సోవియట్ వ్యతిరేకు లింకెవరూ వుండరు.

సోవియట్ పార్టీ నాయకులు చరిత్రలో స్టాలిన్ పాత్రను పూర్తిగా

నిరాకరించారు: ప్రప్రథమ శ్రామికవర్గ నియంతృత్వాన్ని సోషలిస్టు వ్యవస్థనే అంధకారమైనదిగా, భయానకమైనదిగా చిత్రించారు; ఇది సోవియట్ వ్యతిరేక పంథాకాకపోతే మరింకేమిటి?

సోవియట్ పార్టీ నాయకులు శ్రామికవర్గ నియంతృత్వాన్ని రద్దు చేశామని ప్రకటించారు: సోవియట్ పార్టీకున్న శ్రామికవర్గ స్వభావాన్నే తారుమారు చేశారు; సోవియట్ యూనియన్‌లో తిరిగి పెట్టుబడిదారీ శక్తులు తలెత్తేందుకు కవాటాలు తెరచారు. ఇది సోవియట్ వ్యతిరేక పంథాగాక పోతే మరింకేమిటి?

సోవియట్ పార్టీ నాయకులు అమెరికా- సోవియట్ సహకారం కోసం అర్రులు చాస్తున్నారు. ఆత్మగౌరవాన్ని కూడా పరిత్యజించి అమెరికన్ సామ్రాజ్యవాదంతో చేతులు కలుపుతున్నారు: ఆ విధంగా వారు సోవియట్ యూనియన్‌కే తలవంపులు తెస్తున్నారు: మరి ఇది సోవియట్ వ్యతిరేక పంథా కాకపోతే మరింకేమిటి?

సోవియట్ పార్టీ నాయకులు అగ్రరాజ్య దురహంకార విధానాన్ని అనుసరిస్తూ, సోదర సోషలిస్టు దేశాలను తమ అధీన దేశాలుగా చూస్తున్నారు; ఆ విధంగా వారు సోవియట్ ప్రభుత్వ ప్రతిష్టను అప్రతిష్టపాలు జేస్తున్నారు; మరి ఇది సోవియట్ వ్యతిరేకత కాకపోతే మరింకేమిటి?

సోవియట్ పార్టీ నాయకులు ఇతర దేశాల ప్రజల విప్లవపోరాటాల్ని అడ్డుకొంటూ వ్యతిరేకిస్తున్నారు. సామ్రాజ్యవాదానికి, నయావలస విధానానికి వకాల్తాదారులుగా వ్యవహరిస్తున్నారు ఆ విధంగా వారు లెనిన్ పార్టీ ఏర్పర్చిన మహిమాన్వితమైన అంతర్జాతీయతా సంప్రదాయానికిప్పుడు మసి పూస్తున్నారు. మరి ఇది సోవియట్ వ్యతిరేక పంథా గాకపోతే మరింకేమిటి?

ఒక్క ముక్కలో చెప్పాలంటే, సోవియట్ పార్టీ నాయకుల చర్యలు

సోవియట్ మహా దేశానికీ, సోవియట్ కమ్యూనిస్టుపార్టీకే చాల తల వంపులు తెచ్చిపెట్టాయి: సోవియట్ ప్రజల ప్రాథమిక ప్రయోజనాలను తీవ్రంగా దెబ్బతీశాయి. ఈ చర్యలు పూర్తిగా నూటికి నూరుపాళ్లూ సోవియట్ వ్యతిరేక చేష్టలే.

ఇటువంటి పరిస్థితులలో సహజంగానే చైనా కమ్యూనిస్టుపార్టీ తదితర మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీలు, మార్క్సిస్టు-లెనినిస్టులూ మార్క్సిజం-లెనినిజం పవిత్రతనూ, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యతనూ రక్షించుకొనేందుకు శ్రామికవర్గ అంతర్జాతీయతను నిలబెట్టేందుకూ, సోవియట్ పార్టీ నాయకుల రివిజనిస్టు చీలిక పంథాను తీవ్రంగా విమర్శించక తప్పదు. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ నాయకుల రివిజనిస్టు చీలిక తత్వ తప్పిదాలను మాత్రమే మేము వ్యతిరేకిస్తున్నాం. లెనిన్ నిర్మించిన సోవియట్ పార్టీని రక్షించేందుకూ, సోవియట్ యూనియన్ ప్రథమ సోషలిస్టు దేశ, సోవియట్ ప్రజల ప్రాథమిక ప్రయోజనాలను కాపాడేందుకే మేమీ పని చేస్తున్నాం. అయినప్పుడు దీన్ని సోవియట్ వ్యతిరేక చర్యగా ఎలా చిత్రించగలరు?

# 'పనికిమాలిన లక్షణాలే ఆదర్శ ప్రాయాలా?'

ఎవరైనా సరే, మార్క్సిజం-లెనినిజం పంథాను, శ్రామికవర్గ అంతర్జాతీయతా సూత్రాన్ని నిజంగా బలపరుస్తున్నారా లేదా, సోవియట్ పార్టీ సోవియట్ ప్రభుత్వం, సోవియట్ ప్రజల ప్రాథమిక ప్రయోజనాలను నిజంగా రక్షించగోరుతున్నారా లేదా అన్నదాని పైనే సోవియట్ యూనియన్‌ను బలపరుస్తున్నారా లేక వ్యతిరేకిస్తున్నారా అన్నది ఆధారపడి వుంటుంది.

సోవియట్ పార్టీ నాయకులు రివిజనిజాన్ని, చీలికతత్వాన్ని అనుసరిస్తున్నందుకు వారిని తీవ్ర విమర్శకు గురిచేయడమూ అంటే సోవియట్ యూనియన్‌ను బలపర్చడమే. మరో మాటలో చెప్పాలంటే సోవియట్ పార్టీ నాయకులు చేస్తున్నట్లుగా రివిజనిస్టు చీలికతత్వ మార్గాన్ని అనుసరించడమూ అంటే నిజంగా సోవియట్ యూనియన్‌కు వ్యతిరేకంగా పని చేయడమన్న మాటే; ఈ అపమార్గాన్ని పడిపోవడమన్నా లేక దానికి లొంగపోవడమన్నా సోవియట్ యూనియన్‌ను నిజాయితీతో బలపర్చడం కాదు: మీదుమిక్కిలి ఆ మార్గాన్ని అనుసరించడమూ అంటే సోవియట్ ప్రజల ప్రాథమిక ప్రయోజనాలను దెబ్బతీసేందుకు సోవియట్ నాయకులకు సాయపడ్డమే నన్నమాట.

ఈ సందర్భంలో మనం 20వ శతాబ్దపు తొలి రోజుల్లో జర్మన్ సోషల్ డెమోక్రటిక పార్టీ నాయకుఒపట్ల లెనిన్ వైఖరి ఎలా వుండేదో పరిశీలించవచ్చు; జర్మన్ సోషల్ - డెమోక్రటిక్ పార్టీ అనాడు సెకండ్ ఇంటర్నేషనల్‌లోకెల్లా పెద్దపార్టీ; పలుకుబడిగల పార్టీ. అయినప్పటికి ఆ పార్టీ నాయకులలో అవకాశవాదాన్ని వెంటనే పసిగట్టగలిగాడు లెనిన్. అప్పుడాయన, "జర్మన్ సోషల్ డెమోక్రసీయొక్క పనికిమాలిన లక్షణాలనే ఆదర్శప్రాయంగా ఎంచుకోకండ"ని రష్యన్ - సోషల్ డెమోక్రాట్లకు స్పష్టంచేశాడు. [లెనిన్ సెలెక్టడ్ వర్క్స్: న్యూయార్క్ ప్రతి; వాల్యూం 4; పేజీ 315]

ఆయన ఇంకా యిలా అన్నాడు:

"మార్క్స్ భావాలకు మనం న్యాయం కల్గించగోరినా, కార్మికోద్యమ ప్రస్తుత కర్తవ్యాలకు సరిపోయేటట్లు రష్యన్ సోషలిస్టులకు మనం సాయపడాలన్నా, జర్మన్ నాయకులు చేసిన తప్పిదాలను మనం నిర్భయంగా బహిరంగంగా విమర్శించక తప్పదు !!

6)

[ట్రేడ్ యూనియన్లపట్ల పార్టీ వైఖరిపై వోవినోవ్ రాసిన కరపత్రానికి పీఠిక"–కలెక్టడ్ వర్క్స్, మాస్కో ప్రచురణ, 1962: వాల్యూం 13, పేజీ 165

లెనిన్ ఆజ్ఞాభావంలోనే మేమూ సోవియట్‌పార్టీ నాయకులకు ఒక సలహా యివ్వదలచాం! మీరు రివిజనిస్టు తప్పుల్ని సరిచేసుకోకపోతే, సోవియట్‌పార్టీ ప్రయోజనాల దృష్ట్యా సోవియట్ ప్రభుత్వ, సోవియట్ ప్రజల ప్రయోజనాల దృష్ట్యా, సోషలిస్టు శిబిరం, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ ప్రయోజనాల దృష్ట్యా, వాటి ఐక్యత కోసమూ మిమ్మల్ని "నిర్భయంగా, బహిరంగంగా" విమర్శిస్తూనే వుంటాం.

# నేడు జరుగుతున్నది 'నాయకత్వం కోసం పోరాటమా ?'

తమ రివిజనిస్టు, చీలుబాటల పంథాపట్ల మా విమర్శలనూ, వ్యతిరేకతనూ సోవియట్‌పార్టీ నాయకులు "నాయకత్వాన్ని చేజిక్కించుకొనే" తాపత్రయంగా ఆపాదిస్తున్నారు.

మొదటి విషయంగా సోవియట్ పార్టీ నాయకుల్ని ఒకటి అడగదలచాం: మేము నాయకత్వాన్ని చేజిక్కించుకోవాలని కోరుతున్నామని మీ రంటున్నారు గదా, దాన్నెవర్నుంచి చేపట్ట కోరుతున్నాం! ఈనాడు నాయకత్వం ఎవరిది? అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో సోదరపార్టీలన్నింటి మీదా పెత్తనం చెలాయించే నాయకత్వమంటూ ఏదైనా ఒకటి వుందా? వుంటే ఈ నాయకత్వం మీ చేతుల్లోనే వుందా?

సోదరపార్టీ లన్నింటిపైనా పెత్తనం చెలాయించగల సహజమైన నాయకులం తామేనని సోవియట్‌పార్టీ నాయకులు భావిస్తున్నట్లుంది. వీరి తత్వం ప్రకారం, వీరి ప్రోగ్రాము, వీరి తీర్మానాలూ, వీరి ప్రకటనలూ

అన్నీ అజరామరమైన దివ్య సూత్రాలు. కృశ్చేవ్ చేసే ప్రతి రిమార్కు— ఆయన చెప్పే ప్రతి మాటా, అవెంత తప్పిదాలైనా లేక అసంబద్ధమైనవైనా, ప్రభువాజ్ఞలు. వీరి తత్వం ప్రకారం, సోదరపార్టీలన్నీ కిమ్మనకుండా తలొంచుకొని తమ మాట వినాల్సిందే, శిరసావహించాల్సిందే; తమ (సోవియట్ నాయకుల) నిర్ణయాలను సోదరపార్టీలు విమర్శించడానికి వీల్లేదు. వ్యతిరేకించడానికి వీల్లేదు. ఈ వైఖరి నిజంగా నిరంకుశం. ఇది కేవలం ఫ్యూడల్ నియంతల మనస్తత్వం.

ఏమైనప్పటికీ, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం కొంతమంది ఫ్యూడల్ ముఠా మాత్రం కాదని సోవియటు పార్టీ నాయకులకు మేము చెప్పదలిచాం. సోదర పార్టీలన్నీ—అవి పెద్దవైనా చిన్నవైనా, కొత్తవైనా, పాతవైనా అధికారంలో వున్నా లేకపోయినా అన్నీ స్వతంత్ర సమానత్వ ప్రతిపత్తి గలవి. అందరికన్నా తలదన్నిన పార్టీలూ, వాటిముందు అణకువతో మెలగే పార్టీ లున్నాయని గానీ, ఒకటి నడుపుతూ వుండేపార్టీ, మిగతావి దాని వెనకాల నడుస్తూవుండే పార్టీలనిగాని, ఒక పార్టీ పితృమూర్తనీ మిగతా పార్టీలన్నీ దాని బిడ్డలనీ లేదా సోవియట పార్టీ నాయకులు మిగతా సోదర పార్టీలపై విశేషాధికారాలుగల పాలకులనిగానీ, ఏ సోదరపార్టీల సమావేశమూ చెప్పలేదు. ఏకగ్రీవంగా ఆమోదించబడ్డ ఏ ఒప్పందమూ ఎన్నడూ అలా చెప్పలేదు.

విప్లవం యొక్క అసమగ్రాభివృద్ధి మూలంగా, ఒకానొక ప్రత్యేక చారిత్రక దశలో, ఆ యా దేశాల్లోని శ్రామికవర్గమూ, దానిపార్టీ, ఉద్యమంలో అగ్రగామిగా వ్యవహరిస్తూంటుందని అంతర్జాతీయ శ్రామికవర్గ విప్లవోద్యమ చరిత్ర నిరూపిస్తోంది.

బ్రిటన్‌లోని ట్రేడ్ యూనియన్ ఉద్యమమూ, ఫ్రెంచి కార్మికవర్గ రాజకీయ పోరాటమూ వరుసనే అంతర్జాతీయ శ్రామికోద్యమ అగ్రగామి దశంలో వున్నాయని మార్క్స్-ఎంగెల్సులు చెప్పారు. పారిస్ కమ్యూన్

వైఫల్యం అనంతరం ఎంగెల్సు అన్నాడు:- "జర్మన్ కార్మికులు ఈ క్షణానికి శ్రామిక పోరాటంలో అగ్రగామి దళంగా వున్నారు." ఆయన యింకా ఇలా అన్నారు -

"గౌరవనీయమైన ఈ అగ్రగామి స్థానంలో వీళ్ళను పరిస్థితులు ఎంతకాలం సహించగలవో జోస్యం చెప్పలేం........ ఏమైనప్పటికీ ఇక్కడ ప్రధాన విషయమల్లా ఒక్కటి:- దేశభక్తి పేరిట దురహంకారాన్ని సహించనటువంటీ, ఏ దేశంనుంచి వచ్చినా శ్రామికోద్యమంయొక్క ప్రతి నూతన విజయాన్ని ఆనందంతో ఆహ్వానించగలదీ యైన నిజమైన అంతర్జాతీయతా భావాన్ని కాపాడు కోవడమే ప్రధాన విషయం."

[మార్క్సు-ఎంగెల్సు సెలెక్టడ్ వర్క్సు: మాస్కో ప్రచురణ; వాల్యూం 1; పేజీ 653-54]

20వ శతాబ్దపు తొలి రోజులలో అంతర్జాతీయ శ్రామికోద్యమానికి ముందు పీఠీనవున్న రష్యన్ కార్మికవర్గం, చరిత్రలో మొట్టమొదటిసారిగా శ్రామిక విప్లవంలో విజయం సాధించింది.

1919లో లెనిన్ యిలా అన్నాడు - "అంతర్జాతీయ శ్రామిక విప్లవోద్యమ నాయకత్వం ప్రస్తుతానికిమాత్రం—(ఎక్కువకాలం కాదని వేరే చెప్పనక్కరలేదు) రష్యన్‌లకు వెళ్ళింది. ఇంతకుముందు 19వ శతాబ్దంలో వివిధ దశల్లో ఈ నాయకత్వం ఇంగ్లీషు కార్మికవర్గానికి, తరువాత ఫ్రెంచి వారికి, తరువాత జర్మన్లకూ ఇలాగే చేతులు మారింది" [చరిత్రలో థర్డు ఇంటర్నేషనల్: దాని చరిత్ర" సెలెక్టడ్ వర్క్సు: మాస్కో ప్రచురణ, వాల్యూం 2, 2వ భాగం, పేజీ 203]

ఎంగెల్సు "అగ్రగామిదళం" అని ప్రస్తావించినా, లేక లెనిన్ "నాయకత్వం" అని చెప్పినా వాటర్థం అంతర్జాతీయ కార్మికోద్యమంలో అగ్రగామిగావున్న ఏ పార్టీయైనా తాను చెప్పినట్లు చేయాలనిగానీ లేదా శిరసావహించాలనిగాని ఇతర సోదరపార్టీలను ఆజ్ఞాపించడమనిగాని కాదు

ఉద్యమంలో జర్మన్ సోషల్ డెమోక్రటిక్ పార్టీ ముందుపీఠీన వున్నప్పుడు ఎంగెల్సు ఇలా చెప్పాడు:

"యూరోపియన్ శ్రామికవర్గం పేరిట మాట్లాడేహక్కు జర్మన్ సోషల్ డెమోక్రటిక్ పార్టీకి లేదు: ముఖ్యంగా ఏదో తప్పుడు మాటలు చెప్పడానికి అలాంటి హక్కు దానికి అసలే లేదు."

("బెబెల్‌కు ఎంగెల్సు లేఖ", మార్క్సు, ఎంగెల్స్ సెలెక్టెడ్ కరె స్పాండెన్స్: వాల్యూం2. రెండోభాగం: పేజీ 159)

అలాగే రష్యన్ బోల్షివిక్ పార్టీ, ఉద్యమంలో అగ్రగామిగా వున్న ప్పుడు లెనిన్ ఇలా అన్నాడు:

"...ఇతర దేశాలలో ఉద్యమాభివృద్ధి యొక్క ప్రతి దశనూ దృష్టిలో వుంచుకుంటున్నప్పుడు మాస్కోనుంచి మనం ఎటువంటి ఆజ్ఞ (డిక్రీ)నూ జారీ చేయకూడదు."

["రష్యన్ బోల్షివిక్ పార్టీ 8వ మహాసభలో పార్టీ": సెలక్టెడ్ వర్క్సు: మాస్కో ప్రచురణ. వాల్యూం 2; రెండో భాగం. పేజీ 159].

ఎంగెల్సు. లెనిన్‌లు ప్రస్తావించిన పార్టీ అగ్రగామిదళ స్థానంకూడా దీర్ఘకాలంపాటు మార్పులేకుండా వుండజాలదు: ఆ స్థానం మారుతున్న పరిస్థితులనుబట్టి చేతులు మారుతూంటుంది ఆయితే ఈ మార్పు అనేది, ఏ వ్యక్తియొక్క స్వీయ వాంఛల్ని బట్టో లేక ఒకానొక పార్టీ కోర్కెలను బట్టోగాక చరిత్ర గమనంలో తీర్చిదిద్దబడ్డ పరిస్థితులనుబట్టి మారుతూ వుంటుంది. పరిస్థితులు మారితే ఇతర పార్టీలుకూడా ఉద్యమంలో అగ్ర గ్రామిదళం గావచ్చు. అలాగాక గతంలో అగ్రగామిగా వున్న పార్టీ రివిజ నిజాన్ని చేపట్టినప్పుడు, తానెంత పెద్ద పార్టీయైనా. లోగిడ తానెంత గొప్ప ప్రభావాన్ని సంపుకొని వున్నప్పటికీ అగ్రగామిదళ హోదాను కోల్పోక తప్పదు. ఇందుకు జర్మన్ సోషల్ డెమోక్రటిక్ పార్టీ పరిస్థితే నిదర్శనం.

# వాస్తవాలకు అనుగుణంగా కొమిన్టరన్ రద్దు

కమ్యూనిస్టు ఉద్యమంలోని ఒకానొక దశలో, కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ [కొమిన్టరన్] ప్రపంచ కమ్యూనిస్టు పార్టీలకు కేంద్రీకృత నాయకత్వాన్నిచ్చింది. అనేకదేశాలలో కమ్యూనిస్టుపార్టీల అవతరణలోనూ, వాటి అభివృద్ధిలోనూ ఈ ఇంటర్నేషనల్ చరిత్రాత్మకమైన గొప్ప పాత్ర నిర్వహించింది. కాని కమ్యూనిస్టుపార్టీలు పరిపక్వత పొందిన పిమ్మట, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ పరిస్థితి మరింత క్లిష్టతరమైనప్పుడూ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ యొక్క కేంద్రీకృత నాయకత్వం ఆచరణ సాధ్యం గాకుండా పోయింది లేదా అవసరం లేకుండా పోయింది. ఈ కొమిన్టరన్‌ను రద్దుచేస్తూ 1943 లో కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కార్యవర్గ అధ్యక్షమండలి ఒక తీర్మానం చేసింది. అందులో యిలా వుంది.

> "......వ్యక్తిగతంగా ఆయాదేశాల అంతర్గత పరిస్థితీ, అంతర్జాతీయ పరిస్థితి మరింత క్లిష్టతరమవుతున్నకొద్దీ, ప్రతి దేశ కార్మికోద్యమ సమస్యల్ని అంతర్జాతీయ కేంద్రం ద్వారా పరిష్కరించుకో బూనడంవల్ల ఎదుర్కొలేని ప్రతిబంధకాలు యెదురౌతాయి."

ఈ తీర్మానం వాస్తవ పరిస్థితికి సరిపోయిందిగా వుందనీ, సరైనదేనని ఘటనలు రుజువు చేశాయి.

ప్రస్తుత అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో, ఎవరికి ఎవరు నాయకత్వం వహించే హక్కున్నదన్న సమస్య అంత తేలిగ్గా ఉత్పన్నం కాదు. సోదరపార్టీలన్నీ సర్వస్వతంత్రంగా వుండాలి; సమాన ప్రతిపత్తితో మెలగాలి; అదే సమయంలో ఐక్యంగా వుండాలి. సోదర పార్టీలను అందో

శనపర్చే ఉమ్మడి సమస్యలుంటే, సమాలోచన ద్వారా వాటిపై ఏకాభి ప్రాయానికి రావాలి; ఉమ్మడి లక్ష్యంకోసం జరిపే పోరాటంలో, ఈ పార్టీ చర్యలు ఏకోన్ముఖంగా సాగాలి. సోదర పార్టీలమధ్య సంబంధాలను నిర్వహించే సూత్రాలను 1957, 1960 మాస్కో ప్రకటన పత్రాలు స్పష్టంగా రూపొందించాయి.

సోవియట్ పార్టీ నాయకులు తమకు తాము అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ నాయకులుగా భావించుకొని, ఇతర సోదరపార్టీ లన్నింటినీ తమకు లొంగివుండే వాటినిగా భావించడం, మాస్కో ప్రకటన, పత్రాల లోని ఈ నిర్దేశిత సూత్రాలను ఘోరంగా ఉల్లంఘించడమే.

సోదరపార్టీలు పుట్టి పెరిగిన చారిత్రక దశలు విభిన్నం. అందువల్ల అవి భిన్నపరిస్థితులలో వుండడం సహజమే. తమ విప్లవాలలో విజయాన్ని సాధించిన పార్టీలకూ, ఇంకా విజయాలు సాధించని పార్టీలకూ భేదం వుంటుంది. అయితే, విజేతలైనపార్టీలు, ముఖ్యంగా ముందుగా విజయాన్ని సాధించిన పార్టీలు, ఇతర సోదరపార్టీలకు సహకరించడంలో ఎంతో గురుతరమైన అంతర్జాతీయతా బాధ్యత వహించాలిగాని, ఇతర సోదరపార్టీలపై పెత్తనం చెలాయించే హక్కు ఎంతమాత్రం వాటికిలేదని చెప్పడమే ఈ భిన్న పరిస్థితులయొక్క అంతరార్థం.

సోవియట్ కమ్యూనిస్టుపార్టీని నిర్మించినవారు లెనిన్, స్టాలిన్‌లు. శ్రామిక విప్లవాన్ని జయించి, శ్రామికవర్గ నియంతృత్వాన్ని ఏర్పర్చి, సోషలిస్టు నిర్మాణంలో పూనుకున్న ప్రప్రథమపార్టీ సోవియట్‌పార్టీ దీన్ని బట్టి తేలేదేమంటే, సోవియట్‌పార్టీ లెనిన్-స్టాలిన్‌ల విప్లవ సంప్రదాయాన్ని ముందుకు తీసుకుపోయి ఇతర సోదర పార్టీలకు సహకరించడంలో గురుతర బాధ్యతను వహించి అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో అగ్రగామిగా నిలబడాలి అని.

ఈ చారిత్రక పరిస్థితులను చైనా కమ్యూనిస్టుపార్టీ గణనలోకి తీసు

కుంది. అందుకే అది. సోవియట్ యూనియన్ కమ్యూనిస్టుపార్టీ ఈ మహత్తర చారిత్రక బాధ్యతను తన భుజస్కందాలపై వేసుకొంటుందనే హృదయపూర్వక ఆశాభావాన్ని వెలిబుచ్చింది. 1957 నాటి సోదర పార్టీల మాస్కో సమావేశంలో చైనా కమ్యూనిస్టుపార్టీ ప్రతినిధివర్గం, సోషలిస్టు శిబిరానికి అగ్రగామిగా సోవియట్ యూనియన్ వుండాలని నొక్కిచెప్పింది. మా ప్రతినిధివర్గం ఇలా ఎందుకు చెప్పింది? సోవియట్ పార్టీ నాయకులు కొన్ని తప్పులు చేసినప్పటికీ, సోదరపార్టీలన్నీ ఏకగ్రీవంగా ఆమోదించిన మాస్కోపత్రాన్ని వారు (సోవియట్ నాయకులు) కూడా తుట్టతుదకు అంగీకరించినందుననే, సోషలిస్టు శిబిరానికి సోవియటు యూనియనే నాయకత్వం వహించాలన్న మా ప్రతిపాదనను మాస్కో పత్రంలో చేర్చడం జరిగింది.

అగ్రజస్థానం వున్నంతమాత్రాన్నే అది సోదరపార్టీల మధ్య సమానత్వ సూత్రానికి విరుద్ధం కాజాలదనే మా అభిప్రాయం. దీనర్థం, సోవియట్ పార్టీకి ఇతర పార్టీలను కంట్రోల్ చేసే హక్కున్నదని కాదు. సోవియటుపార్టీ భుజస్కంధాలపై గురుతర బాధ్యతా, కర్తవ్యమూ వుందని మాత్రమే దాని అర్థం.

ఏమైనప్పటికీ సోవియట్ పార్టీ నాయకులు ఈ "అగ్రజ" స్థానంతో సంతృప్తిపడలేదు. ఈ విషయమై కృశ్చేవ్ అనేక సందర్భాల్లో ఫిర్యాదు చేశాడు. ఆయనంటాడుగదా: "'అగ్రజస్థానం'లో ఉన్నంత మాత్రాన భౌతికంగా మాకొచ్చిన లాభమేమిటి? అగ్రజస్థానంవల్ల మాకు పాలుగాని, వెన్నగాని రాదు; బంగాళాదుంపలూ రావు, ఇతర కాయగూరలు రావు, మడిమాన్యాలూ రావు బహుశా అందువల్ల మేమేమైనా నైతికంగా లాభిస్తామా? ఉహూఁ, అదీ పూజ్యమే."

[1960 ఫిబ్రవరి 4 న సోషలిస్టు దేశాల సోదర పార్టీల ప్రతినిధివర్గాల గౌరవార్థం యిచ్చిన విందులో కృశ్చేవ్ ప్రసంగం.]

తరువాత మరోసారి యిలా అన్నాడు కృశ్చేవ్ : " 'అగ్రజ' స్థానంలో వున్నంత మాత్రాన మాకు వారిగేదేమిటి ? వద్దు, వద్దు, ఆ స్థానానికో దణ్ణం!"

[1960 జూన్ 24న బుఖారెస్ట్‌లో 12 సోదరపార్టీల ప్రతినిధుల సమావేశంలో ప్రసంగం.]

తమకు అగ్రజస్థానం కావాలన్న కోర్కె లేనేలేదని సోవియట్ పార్టీ నాయకులు అంటారు. కాని ఆచరణలో వారు, అన్ని సోదరపార్టీలపైన పెత్తనం చెలాయించేహక్కు కావాలని డిమాండ్ చేస్తున్నారు. వారు, మార్క్సిస్టు-లెనినిస్టు మార్గాన్ని అనుసరించడానికి తాము అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ అగ్రదళంలో వుండాలనిగాని, ఆ విధంగా తమ శ్రామికవర్గ అంతర్జాతీయ బాధ్యతను నెరవేర్చాల్సిన అవసరంవుందనిగాని భావించడంలేదు. కాని సోదరపార్టీలన్నీ తమ బెత్తానికి లొంగిపోవాలని, రివిజనిజంవెంటా, చీలికతత్వ మార్గానా తమను అనుసరించాలనీ వారు కోరుకొంటున్నారు.

సోవియట్ పార్టీ నాయకులు రివిజనిస్టు చీలికతత్వ మార్గాన్ని చేపట్టడం ద్వారా, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో ఇతఃపూర్వం తమకున్న "అగ్రజ" స్థానాన్ని సహజంగా ఇట్టే కోల్పోయారు. ఈనాడు వారికి "అగ్రజ" అన్న మాటను వర్తింపజేయ దల్చుకుంటే, వారు రివిజనిస్టులకూ, విచ్ఛిన్నకులకూ అగ్రజులన్న అర్థంలో మాత్రమే వర్తింపజేయాలి.

ఈనాడు కమ్యూనిస్టు లందరినీ ఎదుర్కొంటున్నదీ అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమాన్ని ఎదుర్కొంటున్నదీ, ఎవరికి ఎవరు నాయకుడన్న సమస్యకాదు. అసలు ప్రతివాడూ మార్క్సిజం-లెనినిజాన్నీ, శ్రామికవర్గ అంతర్జాతీయతనూ కాపాడాలా లేక సోవియట్ పార్టీ నాయకులు చేపట్టిన

రివిజనిజానికీ, చీలికతత్వానికీ జోహుకుం అనాలా అన్నదే సమస్య. మేము (చైనావారు) నాయకత్వాన్ని చేజిక్కించుకో గోరుతున్నామని సోవియట్ పార్టీ నాయకులు నీలారోపణ చేస్తున్నారు. కాని ఈ నీలాపనిందను వ్యాప్తి చేయడం ద్వారా సోవియట్ నాయకులు వాస్తవంలో, మా పార్టీతో సహః సోదరపార్టీలన్నీ తమ (సోవియట్ నాయకుల) రివిజనిస్టు విచ్ఛిన్నతత్వ నాయకత్వానికి తలొగ్గాలని పట్టుపడుతున్నారు.

1960వ సంవత్సరం లగాయతూ సోవియట్ పార్టీ నాయకులు చైనా కమ్యూనిస్టుపార్టీపై రేపిన దుమారంలో తరచు ఒక ఆరోపణచేస్తూ వచ్చారు: మేము "మెజారిటీ కోర్కెను వమ్ముజేస్తూ" న్నామనీ, "అంతర్జాతీయ క్రమశిక్షణను ఉల్లంఘిస్తున్నామనీ"ను. ఈ సమస్యపై వారితో జరిపిన చర్చను ఇక్కడ సమీక్షించ దలచాం.

1960 జూన్ నెలలో బూఖారెస్టులో 12 సోదరపార్టీల సమావేశం జరిగింది. ఆ సందర్భంగా సోవియట్‌పార్టీ నాయకులు చైనాపార్టీని దుమ్మెత్తిపోస్తూ 'సమాచార లేఖ' అంటూ ఒకటి పంచడంతో చైనాపార్టీపై ఆకస్మాత్తుగా దాడికి పూనుకొన్నారు. అందులో వారు మెజారిటీ అంటూ వెనకేసుకొచ్చి చైనా పార్టీని బలవంతాన లొంగతీయాలని ప్రయత్నించారు. వారి ప్రయత్నం ఫలించలేదు. కాని ఆ సమావేశానంతరం వారు ఒక వాదన తీసుకొచ్చారు. ఏమంటే సోదరపార్టీల మధ్య సంబంధాలలో మెజారిటీకి మైనారిటీ కట్టుబడి వుండాలని, చైనా పార్టీ అభిప్రాయాలను అనేక పార్టీల ప్రతినిధులు వ్యతిరేకించారన్న సాకుతో, బుఖారెస్టు సమావేశంలో "వ్యక్తమైన అభిప్రాయాలను, కోర్కెలను" చైనాపార్టీ గౌరవించి తీరాలని డిమాండ్ చేశారు.

ఈ తప్పుడు వాదనను చైనాపార్టీ కేంద్రకమిటీ 1960 సెప్టెంబర్ 10న సోవియట్‌పార్టీ కేంద్రకమిటీ సమాచారలేఖకు సమాధానంగా రాసిన తిరుగుజాబులో నిరాకరించింది. ఆ జాబులో చైనాపార్టీ కేంద్రకమిటీ ఇలా తెలిపింది:-

"......మార్క్సిజం-లెనినిజం ప్రాథమిక సూత్రాలకు సంబంధించినంత వరకు ప్రతీ విషయంలోనూ ఎవరి కెక్కువ మెజారిటీ వున్నదన్న ప్రాతిపదికపై, ఎవరిది తప్పో, యెవరిది ఒప్పో కరాఖండీగా నిర్ణయించలేము. ఎటొచ్చీ వాస్తవం వాస్తవమే గదా. ఏదో తాత్కాలిక మెజారిటీ వున్నంతమాత్రాన తప్పును వాస్తవంగా మార్చలేం. అలాగే తాత్కాలికంగా మైనారిటీలో వున్నంత మాత్రాన వాస్తవాన్ని తప్పుగానూ మార్చలేము."

# అంతర్జాతీయంగా పార్టీ క్రమశిక్షణను ఉల్లంఘిస్తున్న దెవరు?

అయినప్పటికీ సోవియట్ పార్టీ కేంద్ర కమిటీ 1950 నవంబరు 5న వ్రాసిన లేఖలో అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో మెజారిటీకి మైనారిటీ కట్టుబడి వుండడాన్ని గూర్చిన అసంబద్ధమైన వాదనను మళ్ళా పునశ్చరణ చేసింది. సోవియట్ పార్టీ తన లేఖలో "డ్యూమాలో ఏడుగురు" అన్న లెనిన్ వ్యాసాన్ని ఉటంకిస్తూ, చైనా పార్టీని గూర్చి యిలా ఆరోపించింది:- "సోదరపార్టీల మెజారిటీ అభిప్రాయాన్ని గౌరవించడానికి ఇష్టపడనివాడు మొత్తంమీద అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యతా సంఘీభావాలకు వ్యతిరేకంగా బయటపడుతున్నట్లే."

1960లో మాస్కోలో జరిగిన సోదరపార్టీల సమావేశంలో కూడా చైనా పార్టీ మరోసారి సోవియట్ పార్టీ నాయకుల ఈ అసంబద్ధ అవగాహనను వ్యతిరేకించింది. ఈనాటి వాస్తవ పరిస్థితులలో, అందునా కొమిన్టరన్‌లాంటి కేంద్రీకృత నాయకత్వంలేని సమయంలో, అలాంటిది వాంఛనీయంగాని ఈ సమయంలో, సోదరపార్టీలమధ్య సంబంధాలకు మైనారిటీ

మెజారిటీ అభిప్రాయానికి కట్టుబడివుండాలన్న సూత్రాన్ని వర్తింపజేయడం పూర్తిగా తప్పు అని చైనాపార్టీ చెప్పింది. ఒక వ్యక్తిగత పార్టీలో అయితే, మెజారిటీకి మైనారిటీ కట్టుబడి వుండడమూ క్రిందపార్టీశాఖ పైశాఖకు కట్టుబడి వుండాలన్న సూత్రాన్నీ పాటించవలసిందే. కాని ఆ సూత్రాన్ని సోదర పార్టీలమధ్య సంబంధాలకు వర్తింపజేయలేం. తమమధ్య పరస్పర సంబంధాలలో ప్రతి సోదరపార్టీ తన స్వతంత్ర ప్రతిపత్తిని కాపాడుకుంటూ, అదే సమయంలో మిగతా సోదరపార్టీ లన్నింటితోనూ ఐక్యమవుతూ వుంటుంది. ఇక్కడ మైనారిటీ మెజారిటీకి కట్టుబడి వుండాలన్న బంధం వుండదు. అలాగే క్రిందిశాఖ పైశాఖకు కట్టుబడివుండే సంబంధమూ ఇక్కడ వుండదు. సోదరపార్టీలకు చెందిన ఉమ్మడి సమస్యల విషయంలో సమాలోచనా సూత్రం ఆధారంగా చర్చలు జరుపుకొని ఏకగ్రీవంగా ఒప్పందానికి రావడమొక్కటే ఏకైకమార్గం.

సోవియట్‌పార్టీ కేంద్ర కమిటీ తన లేఖలో మైనారిటీ మెజారిటీకి కట్టుబడి వుండాలన్న సూత్రాన్ని తీసుకొచ్చింది అంటే సమాలోచనలద్వారా ఏకాభిప్రాయానికి రావాలన్న సూత్రాన్ని సోవియట్‌పార్టీ నిరాకరించిందనేది స్పష్టం. ఈ విషయాన్ని చైనాపార్టీ ప్రతినిధివర్గం తెలియజేసింది. అప్పుడు మా ప్రతినిధివర్గం ఇలా ప్రశ్నించింది:

"పార్టీకి అతీతమైన ఏ నిబంధనావళిపై ఆధారపడి సోవియట్‌పార్టీ కేంద్రకమిటీ ఇలాంటి నిర్మాణసూత్రాన్ని ప్రతిపాదిస్తోంది? పార్టీకి అతీతమైన అలాంటి నిబంధనావళిని అన్ని దేశాల కమ్యూనిస్టు, వర్కర్స్ పార్టీలు ఎప్పుడైనా ఆమోదించాయా?

# సమాలోచనల ద్వారానే ఏకాభిప్రాయం సాధన

లెనిన్ రాసిన "డ్యూమాలోని ఏడుగురు సభ్యులు అన్న వ్యాసం నుండి రష్యన్ సోషల్ డెమోక్రటిక్ లేబర్‌పార్టీలో నాటి పరిస్థితికి సంబంధించిన వాక్యాల్ని ఉదహరించడంలో సోవియట్ పార్టీ కేంద్రకమిటీ బుద్ధిపూర్వకంగానే "రష్యన్" అన్న మాటను ఉటంకించకుండా వదలివేసింది. వేరు వేరు పార్టీలలో అనుసరించదగ్గ సూత్రాన్ని, మైనారిటీ మెజారిటీకి కట్టుబడి వుండాలన్న సూత్రాన్ని సోదరపార్టీలమధ్య సంబంధాలకు వర్తింపజేసేందుకే సోవియట్‌పార్టీ కేంద్రకమిటీ ఈ పనిచేసింది. ఈ పన్నుగడను కాస్తా చైనా పార్టీ ప్రతినిధివర్గం బహిర్గతం చెయ్యనుకొన్నది.

చైనా పార్టీ ప్రతినిధివర్గం ఇంకా ఇలా తెల్పింది :

"...వేర్వేరు పార్టీలలోకూడా, మెజారిటీకి మైనారిటీ కట్టుబడి వుండాలన్న సూత్రాన్ని నిర్మాణ వ్యవహారాల్లోనే అనుసరించాలి. అంతేగాని సిద్ధాంత అవగాహనకు సంబంధించిన సమస్యలపైన మెజారిటీ–మైనారిటీ అభిప్రాయ ప్రాతిపదికగా ఒక తప్పటడుగునుంచి విజాన్నే ఎల్లప్పుడూ చెప్పగలమని మాత్రం చెప్పలేము. లెనిన్ సరిగ్గా "డ్యూమాలో 7గురు సభ్యులు" అన్న ఈ వ్యాసంలోనే, డ్యూమాలోని పార్టీగ్రూపుకుచెందిన 7గురు లిక్విడేషనిస్టులయొక్క హేయమైన చర్యను తీవ్రంగా ఖండించారు. ఈ లిక్విడేషనిస్టులు తమకున్న ఒక్క ఓటు మెజారిటీని అవకాశంగా తీసుకొని మైనారిటీలోవున్న మార్క్సిస్టులను అణచివేయజూదారు. ఈ ఏడుగురు లిక్విడేషనిస్టులే మెజారిటీ అయినప్పటికీ ఆ మెజారిటీ మార్క్సిస్టు పంథాలో ఆర్గనైజ్ అయివుంది, అభివృద్ధి చెందిన

చైతన్యవంతులైన రష్యన్ కార్మికుల మెజారిటీ అభిప్రాయానికీ, వారి ఐక్యతీర్మానాలకూ, వారి ఐక్య ఎత్తుగడలకూ ప్రాతినిధ్యం వహించజాలదని లెనిన్ స్పష్టంచేశాడు. అందువల్ల ఐక్యతను గూర్చిన కేకలు కేవలం కపట నాటకమే నన్నాడు. ఆయన యిలా అన్నాడు:- "పార్టీయేతర లిక్విడేషనిస్టులు ఈ ఏడుగురూ కలిసి ఆరుగురు మార్క్సిస్టులను స్వాహా చేయదల్చుకున్నారు. దీన్నే "ఐక్యత" అనమని డిమాండ్ చేస్తున్నారు" [లెనిన్ కలెక్టెడ్ వర్క్స్, వాల్యూం 19. పేజీ 407]. అంతేగాదు; డ్యూమాలోని పార్టీగ్రూపుకు చెందిన ఈ ఆరుగురు మార్క్సిస్టులే నిజంగా శ్రామికవర్గ మెజారిటీ అభిప్రాయానికి అనుగుణంగా వ్యవహరిస్తున్నారని కూడా లెనిన్ అన్నాడు. అలాగే పై ఏడుగురు ప్రతినిధులుకూడా "తమ అణగద్రొక్కే విధానాన్ని వదలుకున్నప్పు"డు మాత్రమే ఐక్యత రక్షించబడ్తుందనీ అన్నాడు లెనిన్. [అదే పుస్తకం, పేజీ 425].

లెనిన్ మాటలు ఏమి నిరూపిస్తున్నాయో చైనా ప్రతినిధివర్గం ఇలా వివరించింది:—

"......పార్టీ గ్రూపులో కూడా మెజారిటీ అభిప్రాయమే ఎల్లప్పుడూ కరెక్టుకాదు; పైగా కొన్ని సందర్భాల్లో, ఐక్యతను కాపాడాల్సి వచ్చినప్పుడు మెజారిటీ "తమ అణగద్రొక్కే విధానాన్ని విసర్జించా"ల్సి వుంటుంది. ఇది ప్రత్యేకించి, సోదర పార్టీలమధ్య సంబంధాలకు సంబంధించిన సమస్య. లెనిన్ చెప్పిన మాటల అర్థమేమిటో పూర్తిగా అవగతం చేసుకోకుండానే సోవియట్ పార్టీ కేంద్ర కమిటీ కామ్రేడ్స్, ఆయన చెప్పిన ఒక వాక్యాన్ని ఉటంకించారు. పైగా వీరు బుద్ధిపూర్వకంగానే ఆయన చెప్పిన వాక్యంలోని ఒక ముఖ్యమైన మాటనే తొలగించివేశారు. పాపం, అప్పటికీ వారి ఉద్దేశం ఫలించలేదు।

మేము "మెజారిటీ అభిప్రాయాన్ని వమ్ముచేస్తున్నా"మని సోవియట్ పార్టీ నాయకులు చేస్తున్న అసంబద్ధ ఆరోపణను కొంతకాలం క్రితమే పూర్తిగా ఖండించాం. ఈ విషయాన్ని రుజువు చేయడానికే మేము, 1960 నాటి మాస్కో సమావేశంలో చైనాపార్టీ ప్రతినిధివర్గ ప్రసంగంనుంచి విస్తారంగా ఉదహరించాం. చైనా కమ్యూనిస్టుపార్టీ తదితర సోదర మార్క్సిస్టు-లెనినిస్టుపార్టీలు పట్టువిడవకుండా ఈ తప్పు అవగాహనను వ్యతిరేకించినందువల్లనే, సోదర పార్టీలమధ్య సమాలోచనల ద్వారా ఏకాభిప్రాయానికి రావాలన్న సూత్రాన్ని 1960 ప్రకటనలో పొందుపర్చడం జరిగింది.

# ఇప్పటికీ పాతపాటే!

అయినాగాని నేటికీ సోవియట్ పార్టీ నాయకులు "మైనారిటీ మెజారిటీకి కట్టుబడి వుండాల"నే కేకలు పెడుతూనే వున్నారు. దీనర్థం, సోదర పార్టీ లన్నింటి స్వతంత్ర సమాన ప్రతిపత్తిని వారు నిరాకరించ గోర్తున్నారనే; దీనర్థం సమాలోచనలద్వారా ఏకాభిప్రాయానికి వద్దామన్న సూత్రాన్ని వారు ఎత్తేసుకోవాలని కోరుతున్నారనే. ఈ నాయకులు, "మెజారిటీ"అని మిషచూపి తమ అభిప్రాయానికి కట్టుబడివుండేటట్లు కొన్ని సోదరపార్టీలను బలవంతం చేయడానికి యత్నిస్తున్నారు; ఆ విధంగా పొందిన బూటకపు బలాన్ని సోదర మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీలను దుమ్మెత్తి పోసేందుకు వినియోగించడానికి ప్రయత్నిస్తున్నారు! అసలు వీరుచేసే పనులే ఒంటెత్తు పోకడలూ, చీలికలు తెచ్చేవి, మాస్కో ప్రకటన పత్రాలకు విరుద్ధమైనవీ.

ఈనాడు, కమ్యూనిస్టుపార్టీ లన్నింటినీ కట్టుబాటుచేసే అంతర్జాతీయ క్రమశిక్షణను గూర్చి ఎవరైనా మాట్లాడితే దానర్థం, సోదర పార్టీలమధ్య

సంబంధాలను నడపాలని మాస్కో ప్రకటన పత్రాలు నిర్దేశించిన సూత్రాలను పాటించడమనే. ఈ సూత్రాలను సోవియట్ పార్టీ నాయకులు ఉల్లంఘించారని నిరూపించడానికి మేము అనేక వాస్తవాల్ని ఉవహరించాం.

సోవియట్ పార్టీ నాయకులు గనుక "మైనారిటీ"నుంచి "మెజారిటీ" అంటూ గిరిగీయాలని పట్టుబట్టినట్లయితే, వారి మెజారిటీని మేము గుర్తించదల్చలేదని వారికి మనసిచ్చి చెప్పదలచాం. మీరు ఆధారపడుతున్న మెజారిటీ కృత్రిమ మెజారిటీ అని చెప్పదలచాం. నిజమైన మెజారిటీ మీ వైపు లేదనీ చెప్పదలచాం. మార్క్సిజం - లెనినిజానికి కట్టుబడివుంటూ దాన్ని కాపాడుతున్న సోదరపార్టీలలోని సభ్యులంతా, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో మైనారిటీగా వున్నారనేది సత్యమేనా? మీరూ మీ అనుయాయులూ ప్రజాబాహుళ్యంనుంచి బాగా వేరుపడిపోయారు. అయినప్పుడు, మీ తప్పుడు పంథాను వ్యతిరేకిస్తున్న పార్టీసభ్యుల్లోని అత్యధిక సంఖ్యాకులూ, ప్రజలూ మీరు చెప్పే మెజారిటీలో భాగమేనని ఎలా లెక్కించగల్గుతారు?

ఇంతకూ మూలసమస్య ఏమిటంటే:- ప్రజల్లో అత్యధిక సంఖ్యాకులపట్ల నిలబడ్తున్నదెవరు? ఈ ప్రజాబాహుళ్యం యొక్క ప్రాథమిక ప్రయోజనాలకు ఎవరు ప్రాతినిధ్యం వహిస్తున్నారు? వారి విప్లవదీక్షను ప్రతిబింబిస్తున్న వారెవరు?

జర్మన్ సోషల్-డెమోక్రటిక్ పార్టీలో పరిస్థితిని గూర్చి 1916 లో లెనిన్ యిలా అన్నాడు :-

"108 మందికి వ్యతిరేకులుగా ఇద్దరే ఇద్దరున్నారు : వారు లెబ్నెక్ట్, రూలీ. అయినా యీ ఇద్దరే లక్షలాది ప్రజలకూ, పీడిత ప్రజాబాహుళ్యానికీ, అసంఖ్యాక ప్రజలకూ, మానవ భవితవ్యానికీ, దినదినమూ వృద్ధిపొందుతూ పరిపక్వమవుతున్న విప్లవానికీ ప్రాతినిధ్యం వహిస్తున్నారు. కాగా పై 108 మంది మాత్రం, శ్రామిక

జనం మధ్య బూర్జువావర్గ తైనాతీలుగా వ్యవహరిస్తూ నేరస్థులు మాదిరి ముఠాలు టాటు చేసుకొంటున్న కొద్దిమందికి మాత్రమే ప్రాతినిధ్యం వహిస్తున్నారు."

("బోరిస్ సావరీన్‌కు బహిరంగలేఖ" లెనిన్ సెలెక్టెడ్ వర్క్సు: వాల్యూం 23, పేజీ 1'0-191)

ఈనాడు ప్రస్తుతానికి రాజకీయ చైతన్యం అంతగా లేకపోయినా, తుదకు తప్పనిసరిగా ఆ చైతన్యాన్ని పొందగలవారితో సహా మొత్తం ప్రపంచ జనాభాలో నూటికి 90 మంది విప్లవాన్ని కోరుకుంటున్నారు. నిజమైన మెజారిటీగావున్నది ప్రజల ప్రాథమిక ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహించే విప్లవకర మార్క్సిస్టు—లెనినిస్టు పార్టీలూ, మార్క్సిస్టు-లెనినిస్టులేగాని, ఈ ప్రయోజనాలకు విద్రోహం తలపెట్టిన కొద్దిమంది రివిజనిస్టులు మాత్రంకాదు.

# సోదర పార్టీలలోని పార్టీ వ్యతిరేక ముఠాలను బలపర్చుతున్న దెవరు?

సోవియట్ పార్టీ నాయకత్వం తన బహిరంగలేఖలో ఒక నిందారోపణ చేస్తోంది:—

"చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం అనేక పార్టీ వ్యతిరేక విద్రోహ ముఠాలను చేరదీసి బలపర్చుతోంది. ఈ ముఠాలు అమెరికా, బ్రెజిల్, ఇటలీ, బెల్జియం, ఆస్ట్రేలియా, ఇండియా కమ్యూనిస్టు పార్టీలను వ్యతిరేకిస్తున్నాయి."

కాని అసలు వాస్తవా లేమిటి?

నిజానికి, ఇటీవల సంవత్సరాల్లో కొన్ని కమ్యూనిస్టు పార్టీలలో వచ్చిన చీలికలు ప్రధానంగా, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ నాయకులు తమ రివిజనిస్టు చీలిక పంథాను బలవంతాన అమలు జరిపించుకొన యత్నించి నందువల్లనే.

కొన్ని కమ్యూనిస్టుపార్టీల నాయకులు, సోవియట్ పార్టీ నాయకులు రుద్దిన రివిజనిస్టు పంథాను ఆమోదించినందువల్లగానీ లేదా తమ రివిజనిస్టు పంథానే సోవియట్ నాయకులు ప్రోత్సహించడంవల్లగానీ వారు తమదేశాల లోని విప్లవోద్యమాన్ని గాలికి వదలివేశారు. విప్లవ లక్ష్యానికి తీరని నష్టాలు తెచ్చిపెట్టారు. వీరు, సోవియట్ పార్టీ నాయకుల్ని అనుసరించడం వల్లా అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలోని రెండు పంథాలమధ్య సాగుతున్న పోరాటంలో సోవియట్ పార్టీ నాయకులకు వంతపాడడంవల్లా ఉద్యమ ఐక్యతకు నష్టం కల్గించినవారవుతారు. ఈ పరిస్థితి తమ స్వంత పార్టీలలోనే అసంతృప్తి వ్యాపించడానికి, మార్క్సిస్టు - లెనినిస్టులనుంచి ప్రతిఘటనా, వ్యతిరేకతా రేకెత్తడానికి దోహదంచేస్తుంది. ఇది తప్పనిసరిగా జరిగేపని.

సోవియట్ పార్టీ నాయకుల్ని "కాపీ" కొట్టడం ద్వారా వారి అనుయాయులు ఆచరణలో చేసేపని తమ స్వంత పార్టీలలో చీలిక విధానాన్ని అనుసరించడమే. వీరు ప్రజాతంత్ర కేంద్రీకృతాధికార సూత్రాన్ని ఉల్లంఘిస్తూ, పార్టీ పంథాకూ, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమాన్ని యెదుర్కొంటున్న ప్రధాన సమస్యలకు సంబంధించిన విభేదాలపై సర్వసాధారణమైన పార్టీ అంతర్గత చర్చలను కూడా అడ్డుకుంటున్నారు. పైగా వీరు, సూత్రానికి కట్టుబడివున్న కమ్యూనిస్టులను అక్రమంగా వెలివేస్తున్నారు. వారిపై దుమ్మెత్తిపోస్తున్నారు. చివరకు పార్టీనుంచి బర్తరఫ్ చేస్తున్నారు. ఫలితంగా, పార్టీలో రెండు పంథాలమధ్య సాగే పోరాటం తప్పనిసరిగా తీవ్రరూపం తీసుకొంటోంది.

క్లుప్తంలో చెప్పాలంటే, ఈనాడు ఈ కమ్యూనిస్టు పార్టీలలో సాగుతున్న పోరాటం— మార్క్సిస్టు - లెనినిస్టు పంథాను అనుసరించాలా లేక రివిజనిస్టు పంథాను అనుసరించాలా ? కమ్యూనిస్టుపార్టీని శ్రామికవర్గానికి నిజమైన అగ్రగామిదళంగా, నిజమైన విప్లవ శ్రామికవర్గపార్టీగా మలచాలా లేక దాన్ని బూర్జువావర్గ భృత్యుడుగానూ, సోషల్ డెమోక్రటిక్ పార్టీకి నకలుగా మార్చాలా? అన్న సమస్యవైపుకు మళ్ళుతోంది.

సోవియట్‌పార్టీ నాయకత్వం తన బహిరంగలేఖలో, అమెరికా, బ్రెజిల్, ఇటలీ, బెల్జియం, ఆస్ట్రేలియా, ఇండియా కమ్యూనిస్టుపార్టీలలోని పోరాటాల్నిగూర్చి వక్రంగా చిత్రించింది. ఈ పార్టీలలోని రివిజనిస్టుముఠా దాడిచేసి వెలివేసిన మార్క్సిస్టు-లెనినిస్టులను సోవియట్‌నాయకులు హేయమైన పరిభాషలో దుమ్మెత్తిపోశారు.

తెలుపును నలుపనీ, నలుపును తెలుపనీ చెప్పడంద్వారా, ఈ కమ్యూనిస్టుపార్టీలలోని పోరాటాల్ని గూర్చిన సత్యాల్ని మూసివేయడంగాని, తారుమారు చేయడంగాని సోవియట్‌పార్టీ నాయకులకు సాధ్యమా? కాదు,కాదు. వారి కది సాధ్యంకాదు!

ఉదాహరణకు బెల్జియన్ కమ్యూనిస్టుపార్టీలోని పార్టీ అంతర్గత పోరాటాన్నే తీసుకోండి.

ఈ పార్టీలో విభేదాలన్నవి చాలాకాలంగా వుంటున్నాయి. ఆదినుంచీ నాయకత్వస్థానంలో వున్న గ్రూపు రివిజనిజం బురదలో మరింత లోతున కూరుకుపోయి మార్క్సిజం-లెనినిజాన్ని, శ్రామికవర్గ అంతర్జాతీయతను వదులుకున్న తరువాత పార్టీలో అంతర్గత పోరాటం మరింత తీవ్రం కాజొచ్చింది.

హంగెరీలో విప్లవ ప్రతీఘాతుక తిరుగుబాటు వచ్చినప్పుడు బెల్జియన్ కమ్యూనిస్టుపార్టీ ఎంతవరకు వెళ్ళిందంటే, ఆ తిరుగుబాటును

అణచివేయడంలో హంగెరీ కార్మికవర్గానికి సాయంవెళ్ళినందుకు సోవియట్ యూనియన్‌ను ఖండిస్తూ ఒక ప్రకటన చేసిందా పార్టీ.

బెల్జియన్ వలసవాదుల దారుణ దమననీతికి వ్యతిరేకంగా కాంగో ప్రజలు సాగించిన సాయుధ ప్రతిఘటనను ఈ రివిజనిస్టుముఠా వ్యతిరేకించింది; కాంగోలో జోక్యం కల్పించుకునేందుకూ, అక్కడి జాతీయ స్వాతంత్ర్యోద్యమాన్ని కాలరాచేందుకూ ఐక్యరాజ్యసమితిని అమెరికన్ సామ్రాజ్యవాదులు ఉపయోగించుకోడాన్ని ఈ రివిజనిస్టు ముఠా బలపర్చింది. "ఐరాస నిర్ణయాలు త్వరత్వరగా సమన్వయంతో అమలు జరగాలని కోరుతూ". ఐరాసకు విజ్ఞప్తి చేయడంలో తాము ప్రథములుగా వున్నందుకు ఈ రివిజనిస్టు ముఠా సిగ్గూ ఎగ్గూ లేకుండా అదొక గర్వకారణంగా యెంచుకొన్నారు.

[కాంగో సమస్యపై "లాహ్యూమనైట్" పత్రికా విలేఖరికి ఎర్నెస్ట్‌బరెల్స్ ఇంటర్వ్యూ, "డ్రాపే రోజీ" - బెల్జియన్ కమ్యూనిస్టు పార్టీ పత్రిక-1960 జూలై 26].

ఈ రివిజనిస్టు ముఠా, టిటో ముఠావారి రివిజనిస్టు కార్యక్రమాన్ని పొగుడుతూ, ఆ కార్యక్రమంలో "మార్క్సిజం-లెనినిజాన్ని పరిపుష్టంచేసే భావాలున్నాయ"ని చెప్పింది.

(చూ: "బెల్జియన్ కమ్యూనిస్టుపార్టీ-యుగోస్లావియా కమ్యూనిస్టు లీగ్" "డ్రాపే రోజీ" 1958, ఏప్రిల్ 22].

ఈ రివిజనిస్టు ముఠా, 1960 నాటి మాస్కో పత్రంలోని అంశాలు కలగూరగంప అనీ, అందులోని ప్రతి 20 పంక్తులలోనూ, పత్రంయొక్క జనరల్ పంథాకు భిన్నమైన భావం వుందనీ" చెప్పి ఆ పత్రానికి విలువ లేకుండా చేశారు.

61

# బెల్జియన్ పార్టీలో స్పేకేరియన్ విచ్ఛిన్న ధోరణులు

1960 చివరిలోనూ, 1961 వ సంవత్సరం ప్రారంభంలోనూ బెల్జియన్ కార్మికులు బ్రహ్మాండమైన సమ్మె చేశారు.

ఆ సమయంలో ఈ రివిజనిస్టు ముఠా, పోలీసులు, సాయుధ సైనికులూ ప్రారంభించిన దాడిని ప్రతిఘటిస్తున్న కార్మికుల చర్యను "బాధ్యతారహితమైన దుందుడుకు చర్యలుగా" ఖండించింది. ఆ విధంగా ఈ ముఠా కార్మికవర్గ పోరాట దీక్షను విచ్ఛిన్నం చేసింది.

[చూ: 1961 డిసెంబర్ 3న బ్రస్సెల్స్ ఫెడరల్ కాంగ్రెస్‌లో జీన్ బ్లూమ్ ఉపన్యాసం:- "పార్టీలో మార్క్సిస్టు-లెనినిస్టు ఐక్యతకోసం, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో మార్క్సిస్టు - లెనినిస్టు ఐక్యత కోసమూ" అన్న వ్యాసంలో జాక్విస్ గ్రిప్పాచే ఉదహరించబడింది. "లె డ్రాపే రోజీ" నుంచి 1962 ఫిబ్రవరి 22].

బెల్జియన్ కార్మికవర్గ ప్రయోజనాలకూ, అంతర్జాతీయ శ్రామికవర్గ ప్రయోజనాలకూ విద్రోహం వాటిల్లిన ఈ సమయంలో ఈ రివిజనిస్టు ముఠాకు వ్యతిరేకంగా కామ్రేడ్ గ్రిప్పా నాయకత్వాన వున్న బెల్జియన్ మార్క్సిస్టు-లెనినిస్టులు చిత్తశుద్ధితో పోరాటం సాగించాల్సి వచ్చింది. ఇది సహజ పరిణామం మాత్రమే. గ్రిప్పా నాయకత్వాన వున్న మార్క్సిస్టు-లెనినిస్టులు పార్టీలోని రివిజనిస్టు ముఠా తప్పిదాలను బహిర్గతంచేసి, వాటిని త్రోసిపుచ్చారు; ఆ ముఠా రివిజనిస్టు పంథాను గట్టిగా ప్రతిఘటించారు, వ్యతిరేకించారు.

ఆ విధంగా, బెల్జియన్ కమ్యూనిస్టుపార్టీలో సాగిన పోరాటం మార్క్సిస్టు-లెనినిస్టు పంథాకూ, రివిజనిస్టు పంథాకూ మధ్యసాగిన పోరాట మన్నది స్పష్టమైపోయింది.

బెల్జియన్ కమ్యూనిస్టుపార్టీలోని రివిజనిస్టు ముఠా, ఈ పార్టీ అంత ర్గత పోరాటాల్ని ఎలా నిర్వహిస్తూ వచ్చింది? ఈ ముఠా, సెక్టేరియన్, విచ్ఛిన్న విధానాన్ని అనుసరించింది; సూత్రబద్ధమైన మార్క్సిస్టు-లెనినిస్టు పంథాకే కట్టుబడివుంటూన్న కమ్యూనిస్టులను దుమ్మెత్తి పోసేందుకూ వెలి వేసేందుకూ అక్రమపద్ధతు లనుసరించింది. బెల్జియన్ కమ్యూనిస్టుపార్టీ 14వ మహాసభ జరిగినప్పుడు, ఆ మహాసభలో జాక్విస్ గ్రిప్పా తదితర కామ్రేడ్స్ మాట్లాడ్డానికి ఈ రివిజనిస్టుముఠా నిరాకరించింది; తన విధా నాన్ని వ్యతిరేకిస్తున్న విస్తృత సభ్యత్వాన్ని ఖాతరు చేయకుండా వారంద రినీ పార్టీనుంచి తొలగించేసినట్లు అక్రమంగా ప్రకటించింది.

సరిగ్గా ఈ పరిస్థితుల్లోనే, కామ్రేడ్ గ్రిప్పా నాయకత్వాన వున్న బెల్జియన్ మార్క్సిస్టు-లెనినిస్టులు విప్లవకర పంథాకు కట్టుబడివుంటూ మొదటి నాయకత్వ గ్రూపు అనుసరించిన రివిజనిస్టు, చీలికపంథాను గట్టిగా ఎదుర్కొన్నారు; తిరిగి బెల్జియన్ కమ్యూనిస్టుపార్టీని పునర్నిర్మించేందుకు పోరాడారు. ఈ మార్క్సిస్టు-లెనినిస్టుల చర్యలు నూటికి నూరుపాళ్ళు కరెక్టుకావా? అవి దూషణ కలితమైనవి కావా?

ఈ విధంగా సోవియట్‌పార్టీ నాయకులు, బెల్జియన్ మార్క్సిస్టు-లెనినిస్టులపై దాడిచేసి వెలివేసేందుకుగాను బెల్జియన్ పార్టీలోని రివిజనిస్టు ముఠాను బాహాటంగా బలపర్చి ప్రోత్సహించారు. తద్వారా సోవియట్‌పార్టీ నాయకులు సోదరపార్టీలలో చీలికలకు తామే సృష్టికర్తలమని చాటు కున్నారు.

# భారత కమ్యూనిస్టుపార్టీ స్థితేమిటి?

ఇక భారత కమ్యూనిస్టుపార్టీకి సంబంధించినంతవరకూ పరిస్థితి ఇంకా ఘోరంగా వుంది.

అనేక వాస్తవ విషయాలు ఆధారంగా 1963 మార్చి 9న "పీపుల్స్ డైలీ" సంపాదకవర్గం "రివిజనిస్టుల ప్రతిబింబం" అని ఒక వ్యాసం ప్రచురించింది. అందులో మేము, డాంగే నాయకత్వానవున్న విద్రోహముఠా మార్క్సిజం-లెనినిజానికీ, శ్రామికవర్గ అంతర్జాతీయతకూ విద్రోహం తలపెట్టిందని చెప్పాం; భారత శ్రామికవర్గ, ప్రజల విప్లవ లక్ష్యానికి ద్రోహం చేసి, జాతీయ దురహంకార మార్గాన్ని, శత్రువర్గానికి లొంగే పంథానూ చేపట్టిందని చెప్పాం. ఈ ముఠా, భారత కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన్ని వశపర్చుకొంది; భారతదేశంలోని బడా పెట్టుబడిదారుల, బడా భూస్వాముల మనోవాంఛలకు అనుగుణంగా, ఆ వర్గ ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహిస్తున్న నెహ్రూ ప్రభుత్వానికి పార్టీని తోకగా తయారుచేస్తోంది.

అప్పటినుంచీ భారత కమ్యూనిస్టుపార్టీ పరిస్థితి ఎలావుంది?

డాంగేముఠా ఇప్పటికీ విద్రోహ మార్గంలోనే పయనిస్తోందని ఈనాడు ప్రతి ఒక్కరూ తెలుసుకోవచ్చు. ఇప్పటికీ ఈ ముఠా వర్గసామరస్యాన్ని బోధిస్తోంది; నెహ్రూ ప్రభుత్వం ద్వారా భారతదేశంలో సోషలిజం తేవచ్చునని ప్రబోధిస్తోంది. 1963 ఆగస్టులో ఈ ముఠా, ప్రభుత్వ దారుణమైన పన్నుల విధానానికి వ్యతిరేకంగా బొంబాయిలో 10 లక్షలమంది జరిపిన గొప్ప సమ్మెను విచ్ఛిన్నం చేసింది. జైల్లో నిర్బంధించిన కమ్యూనిస్టులను విడుదల చేయాలని డిమాండు చేస్తూ కలకత్తాలో బ్రహ్మాండమైన సభను ఏర్పాటు చేయకుండా ఈ ముఠా అడ్డుకో ప్రయత్నించింది. ఈ సభలో లక్షమంది ప్రజలు పాల్గొన్నారు.

ఈ తమ విద్రోహ లక్షణాలు బహిర్గత మవుతున్నకొద్దీ డాంగే అండ్ కంపెనీవారు, భారత కమ్యూనిస్టుపార్టీలోని అసంఖ్యాక సాధారణ సభ్యులనుంచి నానాటికీ మరింత వ్యతిరేకతనూ, ప్రతిఘటననూ ఎదుర్కోవలసి వస్తూంది. డాంగే అండ్ కంపెనీ భారత కమ్యూనిస్టుపార్టీకీ, భారత దేశానికి వేరుపురుగులని రోజురోజుకీ ఎక్కువమంది భారత కమ్యూనిస్టులు

స్పష్టంగా తెలుసుకొంటున్నారు. యీ కమ్యూనిస్టు లిప్పుడు పార్టీయొక్క మహిమాన్వితమైన, చైతన్యవంతమైన విప్లవ సాంప్రదాయాన్ని పునః ప్రతిష్ఠాపించేందుకు పోరాడుతున్నారు. వీరే భారత శ్రామికవర్గానికీ, భారత ప్రజలకూ నిజమైన ప్రతినిధులూ, ఆశాజ్యోతులూ.

చైనా కమ్యూనిస్టుపార్టీ "అపభ్రంశకుల్నీ", "విద్రోహుల"నూ బలపరుస్తోందని సోవియట్ పార్టీ నాయకులు కేకలు వేస్తున్నారు. కాని వాస్తవానికి డాంగే అండ్ కంపెనీలాంటి పచ్చి విద్రోహుల్ని బలపరుస్తున్న వారు సోవియట్ పార్టీ నాయకులే.

రివిజనిజాన్నీ, చీలికతత్వాన్నీ ఎదుర్కొన సాహసించే అనేక దేశాల కమ్యూనిస్టులను సోవియట్ పార్టీ నాయకులు 'అపభ్రంశకులనీ', 'విద్రోహులనీ', 'పార్టీ వ్యతిరేక శక్తుల'నీ నిందిస్తున్నారు. కాని ఈ కమ్యూనిస్టులు చేసిన పాపం ఏమిటి? మార్క్సిజం-లెనినిజానికి కట్టుబడి వుంటూ, విప్లవకర పార్టీకోసం, విప్లవకర పంథాకోసం పట్టుబట్టడమే వారి తప్పిదం! నిందారోపణల ద్వారా ఈ మార్క్సిస్టు-లెనినిస్టులను బెదిరించి, తప్పుడు పంథాను వారిచే చేపట్టించి సరైన పంథాను అనుసరించకుండా చేయాలనే సోవియట్ పార్టీ నాయకులు నిజంగా ఆలోచిస్తున్నారా? ఆ విధంగా ఈ మార్క్సిస్టు-లెనినిస్టుల సక్రమ పంథాను చుదకంటా కొన సాగించకుండా నిరోధించాలని సోవియట్ పార్టీ నాయకులు ఆలోచిస్తున్నారా? ఈ గొంతెమ్మ కోర్కె ఎన్నటికీ వాస్తవం కాజాలదు.

## నిజమైన విప్లవకారులెవరు?

ఎక్కడైనా, ఎల్లకాలాలలోనూ నిజమైన విప్లవకారులు, నిజమైన శ్రామికవర్గ విప్లవ యోధులూ, నిజమైన మార్క్సిస్టు-లెనినిస్టులే [మిలిటెంట్ భౌతికవాదులు] జంకూ గొంకూ లేనివారై వుంటారు: ఇలాంటి వారే, అభివృద్ధి నిరోధకులూ, రివిజనిస్టులూ చేసే నిందారోపణలకు జంకరు.

ఎంచేతనంటే, అభివృద్ధి నిరోధకులులాగా రివిజనిస్టులలాగా పైకి ఘనానా పెద్దయిగా అవుపించేవాళ్ళు భవిష్యత్తుకు ప్రతినిధులు కారనీ, తమలాంటి "అనామకులే" భవిష్యత్తుకు ప్రాతినిధ్యం వహిస్తారనీ ఈ విప్లవకారులకు, నిజమైన శ్రామికవర్గ విప్లవయోధులకూ తెలుసు. మహనీయులంతా ఒకనాటి అనామకులే; అయితే వీరు సత్యసంధులై వుండి, ప్రజా బాహుళ్యం యొక్క సహకారం పొందేవారైనప్పుడు, ఆదిలో అప్రధానులై వున్నప్పటికీ తుదకు విజేతలుకావడం తథ్యం. లెనిన్ విషయంలోనూ, థర్డ్ ఇంటర్నేషనల్ విషయంలోనూ జరిగిందిదే. కాగా సత్యమార్గంనుంచి దూరమై తద్వారా ప్రజాబాహుళ్యం యొక్క సహకారాన్ని కోల్పోయిన గొప్పగొప్ప వ్యక్తులూ, పార్టీ సేనా వాహినులూ క్రుంగి, కృశించి, నశించి పోవడం అనివార్యమవుతుంది. బెర్న్‌స్టీన్, కాట్స్కీల విషయంలోనూ ఘటిల్లిన వాస్తవం ఇదే. ఆయా ప్రత్యేక పరిస్థితులలో ప్రతిదీ తద్భిన్నమైన మార్పుకు మొగ్గు చూపుతూంటుంది.

కమూనిస్టులు విప్లవనేతలు. వీరు విప్లవాలు నడపకపోతే, మార్క్సిస్టులు - లెనినిస్టులు కాజాలరు. రివిజనిస్టులుగానో, మరోదాపతుగానో మారిపోతారు. అంతే. మార్క్సిస్టు-లెనినిస్టులుగా కమ్యూనిస్టులైనవారు స్వభావసిద్ధంగా తమ విప్లవ దృక్పథానికి కట్టుబడివుండాలి; రివిజనిజాన్ని వ్యతిరేకించాలి. అలాగే మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీగావున్న పార్టీ రివిజనిజాన్ని వ్యతిరేకిస్తున్న విప్లవకారులనూ, కమ్యూనిస్టులనూ గట్టిగా బలపర్చాలి.

చైనా కమ్యూనిస్టుపార్టీ ఎన్నడూ తన వైఖరిని దాచుకోలేదు. మార్క్సిజం-లెనినిజానికి కట్టుబడివున్న విప్లవకారులైన కామ్రేడ్స్ అందరినీ మేం బలపరుస్తున్నాం. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో మాకు రివిజనిస్టులతోనే సంబంధాలున్నపుడు మార్క్సిస్టు-లెనినిస్టులతో ఎందు

కుండ పాడదో? ఇతర దేశాలలోని మార్క్సిస్టు-లెనినిస్టులను మేము బల పర్చడమే ఒక విచ్ఛిన్నకర చర్యగా చిత్రిస్తున్నారు సోవియట్ పార్టీ నాయకులు. కాని మా అభిప్రాయంలో ఇది, కేవలం శ్రామికవర్గ అంతర్జాతీయవాద బాధ్యత మాత్రమే. ఆ బాధ్యతను నెరవేర్చడం మా విధి.

# ప్రపంచ శ్రామికవర్గ లక్ష్యంకోసం...

అన్ని దేశాలలోని మార్క్సిస్టు-లెనినిస్టులూ చిక్కులకూ, నిరంకుశ నిర్బంధాలకూ జంకకుండా సత్యమార్గానికి కట్టుబడివుంటూ, తెగించి పోరాడడానికి సిద్ధపడుతున్నారు. తద్వారా వీరు, కమ్యూనిస్టు యోధుల కుండాల్సిన మహావిప్లవ దీక్షను ప్రదర్శిస్తున్నారు. అలాంటి వీరోచిత యోధుల్లో జాక్విస్‌గ్రిప్పా తదితర కామ్రేడ్సు నాయకత్వానవున్న బెల్జియన్ కమ్యూనిస్టులూ; జావో అమజోనస్, మారిస్ గ్రాబోయిస్, తదితర కామ్రేడ్సు నాయకత్వానవున్న బ్రెజిలియన్ కమ్యూనిస్టులు; ఇ. ఎఫ్. హిల్ తదితర కామ్రేడ్సు నాయకత్వానవున్న ఆస్ట్రేలియన్ కమ్యూనిస్టులూ; కుమారసిరి, షణ్ముగదాసన్ తదితర కామ్రేడ్సు నాయకత్వానవున్న సింహళ కమ్యూనిస్టులూ; ఇండియా, ఇటాలియన్, ఫ్రెంచి, అమెరికన్ తదితర కమ్యూనిస్టుపార్టీలలో ఇంటా బయటావున్న అనేకమంది మార్క్సిస్టు-లెనినిస్టులూ వున్నారు. వీరంతా, మార్క్సిజం-లెనినిజం విప్లవ సిద్ధాంతాన్ని నిలబెడుతున్నవారు; మార్క్సిస్టు-లెనినిస్టు సూత్రాలననుసరించి విప్లవకర శ్రామిక వర్గ అగ్రగామి పార్టీలను నిర్మించేందుకు నిరంతరం కృషి చేస్తున్నవారు; తమ తమ దేశాలలోని శ్రామికవర్గ తదితర శ్రామిక జనబాహుళ్యంయొక్క ప్రాథమిక ప్రయోజనాలకు పొసగే విప్లవపంథాను అనుసరిస్తున్నవారు. ఈ విధంగా వారంతా ప్రపంచ శ్రామికవర్గ ఉమ్మడి లక్ష్యంకోసం ప్రధానమైన చేయూతనిస్తున్నారు. అటువంటప్పుడు ప్రపంచమంతటా కమ్యూనిజం

విజయంకోసం పోరాడుతున్న ప్రజలందరి గౌరవానికీ, సానుభూతి సహకారాలకూ వీరు పాత్రులే.

ఒక్క ముక్కలో చెప్పాలంటే దేశమేదైనా చోటేదైనా ఎక్కడ దోపిడీ బానిసత్వాలుంటాయో అక్కడ ప్రతిఘటన వుంటుంది. యెక్కడ రివిజనిస్టులుంటారో ఆక్కడ వారిని ఎదుర్కొంటూ మార్క్సిస్టు-లెనినిస్టులుంటారు. ఎక్కడ పార్టీలోనుంచి మార్క్సిస్టు-లెనినిస్టులను తొలగిస్తారో, ఎక్కడ విచ్ఛిన్న చర్యలకు దిగుతారో అక్కడ గొప్ప మార్క్సిస్టు - లెనినిస్టులూ బలమైన విప్లవ పార్టీలూ పుట్టడం అనివార్యం. ఆధునిక రివిజనిస్టులు ఆశించినదానికి భిన్నమైన మార్పులు వస్తున్నాయి. రివిజనిస్టులు తమ వ్యతిరేకశక్తుల్ని తామే సృష్టించుకొంటున్నారు. చివరకు యీ శక్తులే వారిని భూస్థాపితం చేస్తాయి. ఇది తిరుగులేని సూత్రం.

# ఈ బృహద్వివాదం యొక్క లక్ష్యమేమిటి?

ఇక ఆఖరువిషయానికి వద్దాం. అసలు మార్క్సిజం - లెనినిజానికి కట్టుబడి వుండడమా లేక రివిజనిజానికి కట్టుబడి వుండడమా? శ్రామికవర్గ అంతర్జాతీయతకు కట్టుబడివుండడమా లేక అగ్రరాజ్య దురహంకారాన్ని అనుసరించడమా? ఐక్యతను వాంఛించడమా లేక చీలికను కోరుకోవడమా? ఈ సమస్యలపైనే అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో నేటి బృహద్వివాదం కేంద్రీకృతమైవుంది. ప్రాథమిక సూత్రాలకు సంబంధించిన ఈ వివాదం, సోవియట్ పార్టీ 20 వ మహాసభ లగాయితూ చాలాకాలం నాడే ప్రారంభమైంది. ఈ వివాదం రెండు సంవత్సరాలక్రితం బహిరంగ స్వరూపం తీసుకునేవరకూ, చాలాకాలంపాటు సోదర పార్టీలమధ్య ప్రయివేటు సంభాషణల్లో నలుగుతూ వచ్చింది.

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో సిద్ధాంతానికి సంబంధించి బహిరంగ వాగ్వివాదాన్ని మొదట్లో రెచ్చగొట్టి అలా జరగాలని పట్టుబట్టిన వారు సోవియట్ పార్టీ నాయకులే. ఈ విషయం ప్రతి ఒక్కరికీ తెలుసు.

1961 అక్టోబర్‌లో జరిగిన సోవియట్ పార్టీ 22 వ మహాసభలో సోవియట్ పార్టీ నాయకులు ఆల్బేనియా పార్టీపై బహిరంగ దాడులకు దిగారు. ఈ సభలో పాల్గొన్న చైనాపార్టీ ప్రతినిధివర్గ నాయకుడైన కామ్రేడ్ చౌ-ఎన్‌లై సోవియట్ పార్టీ నాయకుల చర్యకు అభ్యంతరం తెలిపారు. అలా ఒక సోదర పార్టీపైన ఇలా దాడిచేయడం మార్క్సిస్టు - లెనినిస్టు వైఖరికి అనుగుణమైన చర్యగా భావించజాలమని చౌ-ఎన్ లై చెప్పారు. అప్పుడు సోవియట్ పార్టీ నాయకులు చెప్పిన సమాధానమేమిటి? తమ వైఖరే "పూర్తిగా కరెక్టు"అని వారు ప్రకటించారు. [1961 అక్టోబర్ 27 న సోవియట్ పార్టీ 22 వ మహాసభలో కృశ్చేవ్ అంత్యోపన్యాసం : 22 వ మహాసభ డాక్యుమెంట్లు": మాస్కో ప్రచురణ. పేజీ 334.]

బహిరంగ వాగ్వివాదాన్ని ప్రారంభించడంలో తాము "సిద్ధాంతం కోసం సరైన, నిజమైన మార్క్సిస్టు-లెనినిస్టు వైఖరిని మాత్రమే" తీసుకుంటున్నామన్నారు సోవియట్ పార్టీ నాయకులు.

["మన శకం పతాకం", 'ప్రావ్దా' సంపాదకీయం. 1962 ఫిబ్రవరి 21]

తరువాత 1962 జనవరిలో వియత్నాం వర్కర్సు (కమ్యూనిస్టు) పార్టీ ఒక సూచనచేసింది. "రేడియో ప్రచారాల్లోనూ, పత్రికలలోనూ ఉభయపార్టీలూ పరస్పర విమర్శలు మానండి" అని ఆ పార్టీ సూచించింది. ఈ సూచనను చైనా కమ్యూనిస్టుపార్టీ; ఆల్బేనియాపార్టీ తదితర సోదర పార్టీలూ బలపర్చాయి. కాని ఆచరణలో సోవియట్ పార్టీ నాయకులు, ఈ బహిరంగ వాదోపవాదాలు ఆపడానికి నికరమైన నిర్ణయానికి రా నిరాకరిం

దారు. ఆల్బేనియాపార్టీపై బహిరంగదాడులు ఆపలేదు సరికదా. 1962 చివరిలోనూ, 1963 ప్రారంభంలోనూ యూరప్‌లో వరుసనే జరిగిన ఐదు సోదరపార్టీల మహాసభల్లో చైనా కమ్యూనిస్టు పార్టీపైకూడా బహిరంగ దాడులు చేయించడానికి ప్రయత్నాలు చేయసాగారు. ఆ విధంగా అంత వరకూలేని విస్తృతస్థాయిలో మరోసారి బహిరంగ వాదోపవాదాలను ప్రారంభించారు. ఈ పరిస్థితుల్లో మార్గాంతరంలేక మేమువారికి బహిరంగం గానే సమాధానాలు ఇచ్చుకోవాల్సి వచ్చింది.

సోదరపార్టీలు చేసిన దాడులన్నింటికీ మేమింకా సమాధానాలివ్వడం పూర్తిగాలేదు; ఐనప్పటికీ 1963 మార్చినెలలో సోవియట్‌పార్టీ కేంద్ర కమిటీ జాబుకు సమాధానంరాస్తూ మా పార్టీ కేంద్రకమిటీ ఇలా చెప్పింది: చైనా-సోవియట్ పార్టీలమధ్య సాగాల్సిన సంభాషణలకు అనుకూలమైన వాతావరణం సృష్టించడంకోసం మన హక్కులకు భంగం కలగని విధం గానే మార్చి 9 నుంచీ పత్రికలతో బహిరంగ సమాధానా లిచ్చుకోవడాన్ని తాత్కాలికంగా ఆపుచేయాలి.

కాని సంభాషణలు జరగనున్న సందర్భంలోనే సోవియట్ పార్టీ నాయకులు తమ పార్టీ ప్రకటనల్లోనూ, తీర్మానాల్లోనూ పేరు పెట్టి మరీ చైనా కమ్యూనిస్టుపార్టీని బహిరంగంగా విమర్శించసాగారు.

మాస్కోలో ఒకవైపున చైనా-సోవియట్‌పార్టీల ప్రతినిధివర్గాల మధ్య సంభాషణలు జరుగుతుండగా మధ్యలోనే సోవియట్‌పార్టీ కేంద్ర కమిటీ సోవియట్ యూనియన్‌లోని పార్టీశాఖలకూ, కమ్యూనిస్టులందరికీ అంటూ తన బహిరంగలేఖను ప్రకటించింది. ఈ లేఖలో సోవియట్‌పార్టీ కేంద్రకమిటీ వాస్తవాలను తారుమారుచేసింది. తప్పొప్పుల్ని గందరగోళ పర్చింది. చైనా కమ్యూనిస్టుపార్టీనీ, కామ్రేడ్ మావోసేటుంగ్‌ను అతి నీచంగా వాగాడంబరతతో దుమ్మెత్తిపోసింది. నిందించింది. ఆ విధంగా సోవియట్‌పార్టీ నాయకులు మరో అడుగు ముందుకువెళ్ళి, మరింత విస్తృ తంగా బహిరంగ వాదోపవాదాలను రెచ్చగొట్టారు.

# 1963 జూలై 15 అనంతరం

1963 జూలై 15వ తేదీ లగాయతూ సోవియట్ పార్టీ నాయకులు, చైనాపై నిందారోపణలు గావిస్తూ చైనాను తమ ప్రథమ శత్రువుగా ఎంచసాగారు.

తమ కందుబాటులో వున్న ప్రతి సాధనను వినియోగించారు.

ఇందుకై వారు, ప్రభుత్వ ప్రకటనలను, నాయకుల ఉపన్యాసాలను, సభలనూ, సమావేశాలనూ, వ్యాసాలను ఉపయోగించుకొన్నారు: తమ ప్రచార యంత్రాంగాన్నంతనూ-కేంద్ర, స్థానిక పత్రికల దగ్గర్నుంచి రేడియో, టెలివిజన్‌ల వరకూ - వినియోగించుకొన్నారు. 1963 జూలై 15 కూ, అక్టోబరు 31 వ తేదీకి మధ్యకాలంలో సోవియట్ పార్టీకి చెందిన 26 కేంద్ర వార్తా పత్రికలూ, పత్రికల సంపాదక వర్గాలు ప్రచురించిన సంపాదకీయాలూ, చేసిన వ్యాఖ్యాలు, రాసిన వ్యాసాలు, సంపాదక లేఖలూ, వేసిన వ్యంగచిత్రాలూ మొత్తం 1119 వరకూ వున్నాయి. ఈ వ్యాసాల్లో చైనా కమ్యూనిస్టు పార్టీని, దాని నాయకులైన మావో సేటుంగ్, లీ షావ్ చీ. చౌ- ఎన్ లై తదితర కామ్రేడ్స్‌ను పేరుపెట్టి తిట్టిపోసింది. అక్కడి యూనియన్ రిపబ్లిక్‌లకు చెందిన 15 పత్రికలలో వచ్చిన సమాచారం ఆధారం చేసుకొని తీసిన లెక్కల ప్రకారం చూస్తే అదే కాలంలో సోవియట్ స్థానిక పత్రికల్లో వచ్చిన చైనా వ్యతిరేక వ్యాసాలూ, వార్తలూ కనీసం 728 వరకూ వున్నాయని తేలింది.

మేము, సోవియట్ పార్టీ కేంద్ర కమిటీ ప్రకటించిన బహిరంగ లేఖతో సహా అతి ముఖ్యమైన చైనా వ్యతిరేక వ్యాసాలన్నింటినీ ప్రచురించాము. సోవియట్ పార్టీ బహిరంగ లేఖ పూర్తి పాఠాన్ని రెండుసార్లు అచ్చువేశాం. యావత్ప్రపంచానికి దాన్ని రేడియో ద్వారా ప్రసారంచేశాం. ఎందుకు? ఈ బహిరంగ వాదోపవాదాలో ఆసక్తి గలవారికి సోవియట్ పార్టీ

నాయకుల అభిప్రాయాలను వెలివిడి చేయడానికే మేమీ పనిచేశాం. చైనాను దుష్కృత్తిపోస్తూ రాసిన సోవియట్ వ్యాసాలన్నింటినీ ప్రతి ఒక్కదాన్నీ మేము అచ్చువేయలేదు. ఎందుచేతనంటే, అలాంటి వ్యాసాలు కోకొల్లలుగా వున్నందునా, అనేక విషయాల్లో చెప్పిందేచెప్పడం జరిగినందువల్లా, మా పత్రికలకున్న స్థలాభావం దృష్ట్యా మాత్రమే అన్ని వ్యాసాలనూ అచ్చు వేయలేక పోయాం. కాని మా ప్రచురణాలయాలు ఆ వ్యాసాలన్నింటినీ సేకరించే వుంచాయి; వాటన్నింటినీ పుస్తకం రూపంలో ముద్రించ నున్నాం.

## 2,000 చైనా వ్యతిరేక వ్యాసాలు

సోవియట్ పక్షం వారు ఇప్పటికే చైనా వ్యతిరేక వ్యాసాలనూ, ఇతర అంశాలనూ సుమారు రెండువేలకు పైగా ప్రకటించారు. సోదరపార్టీ లన్నింటి మధ్య సమానత్వ సూత్రాన్ని ఆధారం చేసుకొని, సరిగ్గా అన్ని వ్యాసాలకూ సమాధాన రూపంగా ప్రకటించే హక్కు చైనా పక్షానికి వుంది.

సోవియట్ పార్టీ కేంద్రకమిటీ బహిరంగలేఖ. మార్క్సిజం - లెని నిజంలోని అనేక ప్రాథమిక సిద్ధాంత విషయాలకు సంబంధించిన అనేక సమస్యలనూ, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో గత ఏడెనిమిది సంవత్సరాలుగా ఉత్పన్నమైన అనేక ప్రధాన ఘటనలనూ ప్రస్తావించింది. అందువల్ల "పీపుల్స్ డైలీ", "రెడ్ఫ్లాగ్"పత్రికల సంపాదకవర్గాలు వాటిని జాగ్రత్తగా పరిశీలించిన తరువాత వ్యాఖ్యానపరంపరం ప్రారంభించాయి. ఈ వ్యాఖ్యలు 1963 సెప్టెంబర్ 6 న ప్రారంభమైనాయి. ఇప్పటివరకూ మేము సోవియట్పార్టీ బహిరంగలేఖపై ప్రచురించినవి ఏడు వ్యాసాలు మాత్రమే (ఈ వ్యాసంతోసహా).

ఇంకా మా వ్యాఖ్యాన పరంపర పూర్తికా లేదు. ఇక సోవియట్

కేంద్రపత్రికలు గానీ స్థానిక పత్రికలుగానీ ప్రచురించిన అనేక చైనా వ్యతి రేక వ్యాసాలను సంబంధించి ఇంతవరకూ వాటికి మీరింకా సమాధానివ్వ బూనుకోనే లేదు.

కృశ్చేవ్ 1963 అక్టోబర్ 25 న పత్రికాగోష్ఠిలో ప్రశ్నలకు సమా ధానాలిస్తూ, బహిరంగ వాదోపవాదాలు ఆగిపోవాలని పిలుపిచ్చారు. అయి నప్పటికీ తరువాత సోవియట్ పత్రికలు చైనాను దుమ్మెత్తిపోస్తూ వ్యాస పరంపరను సాగిస్తూనే వచ్చాయి.

తిరిగి మళ్ళీ సోవియట్ పార్టీ నాయకులు ఈ బహిరంగ వాదోప వాదాలని ఆపాలని ఇటీవల సూచించారు. ఈ బహిరంగ వాదోపవాదాలు "కమ్యూనిస్టు ఉద్యమానికి అపారమైన నష్టం కల్గించాయి"ని చెప్పారు. అయినా లోగడ, బహిరంగ వాగ్వివాదం "యావత్ ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ ప్రయోజనాలకోసమే"నని చెప్పింది వీరే.

["కమ్యూనిజంవైపు, నూతన విజయాల సాధనవైపు" 'కమ్యూనిస్టు' పత్రిక సంపాదకవర్గ వ్యాసం: నం. 16. 1961]

అలాగే బహిరంగ వాదోపవాదం "సిద్ధాంతంకోసం సరైన నిజమైన మార్క్సిస్టు-లెనినిస్టు వైఖరి మాత్రమే"నని కూడా వీరే చెప్పారు. సోవి యట్ పార్టీ నాయకుల్ని ఒక ప్రశ్న వేయదలచాం: ఒకప్పుడు ఒక మాట, మరొకప్పుడు మరోమాట చెప్తున్నారు మీరు. మీరాడుతున్న ఆట ఏమిటో చెప్తారా?

సోవియట్ పార్టీ నాయకుల్ని మరోమాట అడగదలిచాం; చైనాను దుమ్మెత్తిపోస్తూ మీరు ప్రచురించిన రెండువేల వ్యాసాలకూ, ఇతర పార్టీ లకూ సమాధానంగా మేము పది వ్యాసాలు కూడా ప్రచురించ కుండానే మమ్మల్ని నోరు మూసుకోమనటం సోదరపార్టీల మధ్య సమా నత్వ సూత్రానికి అనుగుణమేనా? పైగా మీ బహిరంగలేఖకు సమాధానం ఇంకా పూర్తికాకుండానే మమ్మల్ని ఆపమనడం సోదర పార్టీలమధ్య

సమానత్వ సూత్రానికిఅనుగుణమైనదేనా?మీరెంతకాలంగానో ఎన్నోచెప్తూం డగా మేము చెప్పిందే కొద్దయినప్పుడు మీరు ఓర్పు లేకుండా అసహనంతో మెలగడమూ, మేము చెప్పేది విననిరాకరించడమూ, ప్రజాతంత్ర చర్చా సూత్రాలకు అనుగుణంగానే వుందా?

అలాగే సోవియట్ పార్టీ నాయకులను మరోప్రశ్న అడగదలచాం:- చైనావారు వాదోపవాదాల్ని కొనసాగించినట్లయితే "ఈ మార్గంలో సోవియట్పార్టీనుండీ, సోవియట్ ప్రజలనుండీ తిరుగులేని దెబ్బ తినాల్సి వస్తుందని వారు [చైనావారు-సం॥] బాగా గ్రహించాలి" అని సోవియట్ ప్రభుత్వం 1963 సెప్టెంబర్ 21 న ఒక ప్రకటన చేసింది. యింత సిగ్గు లేకుండా ప్రకటించడమూ అంటే మీరు, బరితెగి బెదిరించడమూ, అది లించడమూ కాదా? మిగతావాళ్ళు మీ హుకుంలను శిరసావహించి మీ గద్దింపులకు వణకిపోతారనే మీరు నిజంగా నమ్ముతున్నారా? మనసువిప్పి చెప్పాలంటే, సెప్టెంబరు 21వ తేదీ లగాయతు మేము ఆ "తిరుగులేని దెబ్బ" ఎలా వుంటుందో చూడ్డానికే ఆసక్తితో కాచుక్కూర్చున్నాం.

ఓ కామ్రేడ్స్! సోదరులారా! మీరు పొరబడ్డారు, పూర్తిగా పొర బడ్డారు.

ఇప్పుడు బహిరంగ వాదోపవాదాలు ప్రారంభమైనాయి. రూల్ ప్రకారం ఈ చర్చ ముందుకు సాగిపోవాల్సిందే. మీరు చాలినంత చెప్పాములే అని భావిస్తే, మరి రెండో పక్షానికి కూడా సమాధానం ఇవ్వ టానికి తగినంత అవకాశాన్నివ్వాలి. అలాగాదు,'మేమూ చెప్పాల్సిందింకా చాలా వుంద'ని మీరు భావించుకుంటే, దయచేసి ఆ చెప్పేదంతా చెప్పె య్యండి. కాని మీరలా ఏదైనా చెప్పేటప్పుడు రెండో పక్షానిక్కూడా సమాధానం ఇచ్చుకోడానికి పూర్తి అవకాశం ఇవ్వండి. ఒక్కమాటలో చెప్పాలంటే సమాన హక్కులుండాలి. సోదరపార్టీలన్ని సమానమైనవే

10)

నని మీరు కూడా చెప్పారుకదా ? అటువంటప్పుడు సోదరపార్టీలపై మీ రెప్పుడు దాడి చేయదల్చుకుంటే అప్పుడు బహిరంగ వాదోపవాదాల్ని మీరు ప్రారంభించవచ్చని పట్టుబట్టడం దేనికి ? అదే సమయంలో మీరు మీ ఇష్టం వచ్చినప్పుడు వాదోపవాదాల్ని ఆపదల్చుకొని, ఇతరపార్టీలకు సమాధానా లిచ్చుకొనే హక్కును హరించడం దేనికి ?

సోవియట్ పార్టీ నాయకులు విచ్చలవిడిగా బహిరంగ వాదోపవాదాల్ని రెచ్చగొట్టారు; వాటిని విస్తృతపర్చారు; అలా జరగాల్సిందేనని పట్టుబట్టారు. కాని ఇప్పుడు వారు, ఆ వాదోపవాదాలు ఆగాలని కేక లేస్తున్నారు. ఈ కేకల వెనుకనున్న భాగోతమేమిటి?

ఈ వాదోపవాదాల్ని ప్రారంభించిన వారు ఆశించినట్లుగా పరిస్థితులు అనుకూలించడంలేదు. బహిరంగ వాదోపవాదాలు తమకే అనుకూలిస్తాయని మొదట్లో భావించారు సోవియట్ పార్టీ నాయకులు. కాని ఆ చర్చ తమ వాంఛలకు భిన్నంగా సాగుతోందిప్పుడు. నిజం సోవియట్ పార్టీ నాయకుల వైపులేదు; అందువల్ల ఇతర్లపై చేస్తున్న దాడుల్లో వారు అబద్ధాలమీదా, నీలారోపణలమీదా, వాస్తవ విషయాల వక్రీకరణపైనా, తప్పొప్పుల్ని కలగాపులగంచేసి గందరగోళపర్చడం పైన మాత్రమే ఆధారపడగలరు. వాదన బలపడుతున్నకొద్దీ, వాస్తవాల్ని పేర్కొని హేతుపూర్వకంగా విషయాన్ని నిగ్గుతేల్చడం అవసరమైనకొద్దీ, సోవియట్ పార్టీ నాయకులు నించున్నపళంగా తమ కాళ్ళు తేలిపోతున్నట్లు తెలుసుకుంటున్నారు; భయపడిపోతున్నారు.

లెనిన్ ఒకసారి అన్నాడు: రివిజనిస్టులకు "ఇప్పుడున్న సైద్ధాంతిక, కార్యక్రమావళి, ఎత్తుగడలకు సంబంధించి, నిర్మాణానికి సంబంధించిన విభేదాల వివరణకన్నా అనంగీకారమైనదిగాని, అవాంఛనీయమైనదిగాని, ఆమోదయోగ్యంకానిదిగాని మరొకటి వుండదు."

["అంతర్జాతీయ సోషలిస్టు సమితి; లిక్విడేటర్లగూర్చి మరోసారి" కలెక్టెడ్ వర్క్స్. మాస్కో ప్రచురణ, వాల్యూం, 20. పేజీ, 3"]

సరిగ్గా ఇదే పరిస్థితిలో నేడు సోవియట్ పార్టీ నాయకులున్నారు.

# బహిరంగ వాదోపవాదాలపట్ల చైనాపార్టీ వైఖరేమిటి?

బహిరంగ వాదోపవాదాలపట్ల చైనా కమ్యూనిస్టుపార్టీ వైఖరేమిటో అందరికీ తెలిసిందే సోదరపార్టీలమధ్య విభేదాలను ప్రయివేట్ సమాలోచనలద్వారా పరిష్కరించుకోవాలని మేము ఆదినుండీ చెపుతూనే వున్నాం. బహిరంగ వాదోపవాదాల్ని మేము రెచ్చగొట్టనూలేదు, కావాలని వాంఛించనూలేదు.

ఏమైనప్పటికీ బహిరంగచర్చ ఇప్పటికీ సాగుతోంది కాబట్టి, అలా బహిరంగచర్చను నడపడాన్ని సోవియట్ పార్టీ నాయకులు "లెనిన్ పద్ధతుల్లో జరుగుతున్న చర్య"గా [చు: "లెనినిస్టుపార్టీ చరిత్రాత్మక మహాసభ" ప్రావ్దా-1961. నవంబరు 4.] సోవియట్ పార్టీ నాయకులు చెప్పారుకాబట్టి, వాస్తవాలను పేర్కొంటూ హేతుబద్ధంగా సమస్య పూర్తిగా తేలిపోయే వరకూ ఈ వాదోపవాదాల్ని ప్రజాతంత్ర చర్చ ప్రాతిపదికగా నిర్వహించాల్సిందే.

అంతకన్నా ప్రధానవిషయం ఒకటి వుంది: సోవియట్ పార్టీ నాయకులు మార్క్సిజం-లెనినిజానికి, శ్రామికవర్గ అంతర్జాతీయతకు బాహాటంగా ద్రోహం తలపెట్టినందునా, మాస్కో ప్రకటన పత్రాలను మట్టిపాలు చేసినందునా, మేము మార్క్సిజం-లెనినిజాన్ని శ్రామికవర్గ అంతర్జాతీయతను మాస్కో ప్రకటన పత్రాల్లోని విప్లవ సూత్రాలను రక్షించుకోకుండా ఉంటా

మనిగాని వారు మాత్రం ఆశించలేరు. ఈ చర్చ అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలోని సిద్ధాంత విషయకమైన ప్రధాన సమస్యలకు సంబంధించిన దైనందున ఆ సమస్యల్ని పూర్తిగా తేల్చుకోవాల్సిన అవసరం వుంది. ఇది కూడా చిత్తశుద్ధిగల మార్క్సిస్టు-లెనినిస్టు వైఖరినే ప్రతిబింబిస్తోంది.

ఇంతకూ సారాంశం ఏమిటంటే, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో ఈనాడున్న విభేదాలు, మార్క్సిజం- లెనినిజానికీ, రివిజనిజానికీ మధ్యనున్న విభేదాలు, శ్రామికవర్గ అంతర్జాతీయతతూ, అగ్రరాజ్య దురహంకారానికీ మధ్యనున్న విభేదాలు, సూత్రానికి సంబంధించిన ఈ ప్రధాన విభేదాలు, బహిరంగచర్చను ఆపుచేయడంద్వారా సమూలంగా పరిష్కారం కావు. మీదుమిక్కిలి బహిరంగ చర్చ ద్వారానే వాస్తవాల్ని ముందుంచుతూ విషయాల్ని హేతుపూర్వకంగా సిగ్గుతేల్చడం ద్వారానే సమస్యల్ని వివరించడం సాధ్యపడ్తుంది. అపుడే తప్పొప్పుల మధ్య తారతమ్యాన్ని కనిపెట్టగల్గుతాం; అప్పుడు మాత్రమే మార్క్సిజం-లెనినిజం ఆధారంగా శ్రామిక వర్గ అంతర్జాతీయత ఆధారంగా అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యతను పరిరక్షించుకో గల్గుతాం. బలోపేతం చేసుకోగల్గుతాం.

మార్క్సిజం-లెనినిజం అనేదొక విజ్ఞానశాస్త్రం (సైన్స్). విజ్ఞాన శాస్త్ర మెపుడూ చర్చ అంటే భయపడదు. చర్చనుచూసి భయపడే దేదైనా సరే, అది విజ్ఞానశాస్త్రం కానేకాదు. అన్ని దేశాలలోని కమ్యూనిస్టులూ, విప్లవకారులూ, విప్లవశక్తులూ మార్క్సిజం-లెనినిజం యొక్క ప్రాథమిక సిద్ధాంతాలకు అనుగుణంగా తమ దేశాలలోని విప్లవాలెదుర్కొంటున్న సమస్యల్ని గూర్చి ప్రపంచ విప్లవ సమస్యల్ని గూర్చి తమ బుర్రలు విని యోగించి ఆలోచించాల్సి వుంది. ఇలా అని అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో నేడుసాగుతున్న బృహద్వివాదం నొక్కి చెపుతోంది. ఈ బృహద్వివాదం ద్వారా ప్రజలు, తప్పొప్పుల మధ్య తారతమ్యాన్ని తెలుసుకోగల్గుతారు; ఏది నిజమైన మార్క్సిజం-లెనినిజమో, ఏది బూటకమో

తెలుసుకోగల్గుతారు. ఈ బృహద్వివాదం ద్వారానే ప్రపంచంలోని విప్లవ శక్తులన్నీ సమీకృతమవుతాయి; మార్క్సిస్టు-లెనినిస్టులందరూ సిద్ధాంత రీత్యానూ, రాజకీయంగానూ రాటుతేలతారు; ఇప్పటికన్నా మరింత పరిపక్వతతో మార్క్సిజం-లెనినిజం తమ తమ దేశాలలోని నిర్దుష్ట కార్యాచరణతో జోడించగల్గుతారు. ఆ విధంగా మార్క్సిజం-లెనినిజం, నిస్సందేహంగా మరింత పరిపుష్టమవుతుంది; మరింత ఎదిగి వస్తుంది; నూతన శిఖరాలను అందుకొంటుంది.

# ఐక్యతను రక్షించి బలోపేతం చేసే మార్గమేది?

సోవియట్ పార్టీ నాయకుల రివిజనిజమూ, అగ్రరాజ్య దురహంకారమూ సోషలిస్టు శిబిర ఐక్యతకూ, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యతకూ కనీ వినీ ఎరగనంతటి ఉపద్రవంగా పరిణమించింది. సోవియట్ పార్టీ నాయకులు రివిజనిస్టు, అగ్రరాజ్యదురహంకార మార్గం చేపట్టడం ద్వారా, చీలికకు సిద్ధపడుతున్నారు. ఈ వైఖరిని వారు విడనాడనంత కాలమూ వారు వాస్తవంలో బూటకపు ఐక్యతకోసమూ, నిజమైన చీలిక కోసమూ పనిచేస్తున్నట్లే లెక్క. "ఐక్యత" అంటూ వాళ్ళెంతెంతేసి కబుర్లుచెప్పినా, ఇతరులను ఎంతగా "విచ్ఛిన్నకుల"నీ, "సెక్టేరియన్ల"నీ నిందించినా పరిస్థితి ఇది.

చైనా కమ్యూనిస్టుపార్టీ ఇతర మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీలూ, మార్క్సిస్టు-లెనినిస్టులూ అంతా మార్క్సిజం-లెనినిజంలోనే శ్రామికవర్గ అంతర్జాతీయతలోనే కృషిచేస్తూ వుంటారు. నిజమైన సోషలిస్టు శిబిర ఐక్యతనూ, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యతనూ రక్షించుకొని, బలపర్చుకోవాలంటే ఈ వైఖరొక్కటే సరైనమార్గం.

మార్క్సిజం-లెనినిజమూ శ్రామికవర్గ అంతర్జాతీయతా-ఈ రెండూ కలసి ఐక్యతకు పునాది అవుతాయి. ఈ ప్రాతిపదికమీద మాత్రమే సోదర పార్టీల ఐక్యతనూ, సోదర సోషలిస్టు దేశాల ఐక్యతనూ నిర్మించవచ్చు. అలాగాక ఎవరైనా ఈ ప్రాతిపదికనుంచి వేరుపడిపోతే ఇలాంటి ఐక్యత అనేది సాధ్యంకాదు. మార్క్సిజం-లెనినిజం కోసమూ, శ్రామికవర్గ అంత ర్జాతీయతకోసమూ పోరాడ్డమంటే, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యతకోసం కృషి చేయడమనే అర్థం. సూత్రానికి కట్టుబడి వుండడమూ, ఐక్యతను కాపాడ్డమూ అనేవి ఒకదాని కొకటి పెనవేసుకొని వున్నట్టివి.

* సోవియట్‌పార్టీ నాయకులు నిజంగానే ఐక్యతను కోరుతున్న ట్లయితే, దొంగనాటక మాడకుండా వున్నట్లయితే, మార్క్సిజం- లెనినిజం యొక్క మూలసిద్ధాంతాలకు విధేయతతో బద్ధులై వుండాలి; వర్గాలనుగూర్చి వర్గపోరాటానికి సంబంధించీ, రాజ్యాంగ యంత్రమూ-విప్లవం గూర్చి ముఖ్యంగా శ్రామిక విప్లవం గూర్చి శ్రామికవర్గ నియంతృత్వాన్ని గూర్చిన మార్క్సిస్టు-లెనినిస్టు బోధలకు విధేయతతో బద్ధులై వుండాలి. ఏ సాకు చూపైనాసరే అది ఆధారంగా, వాళ్ళు వర్గపోరాటం స్థానే వర్గసామ రస్యాన్నిగాని లేక శత్రువర్గం ముందు మోకరిల్లడాన్నిగానీ, శ్రామిక విప్లవం స్థానే సంస్కరణ వాదాన్నిగాని లేక సాత్త్వికవాదాన్ని ప్రవేశ పెట్టడాన్నిగానీ, లేదా శ్రామికవర్గ నియంతృత్వాన్ని రద్దుచేయడాన్నిగానీ ఏ మాత్రమూ అనుమతించరాదు.

* సోవియట్‌పార్టీ నాయకులు నిజంగానే ఐక్యతను కోరుకుంటు న్నట్లయితే, వారు నాటకమాడనట్లయితే, 1957, 1960 ల నాటి మాస్కో ప్రకటన, పత్రాలలోని విప్లవ సూత్రాలకు తొణక్కుండా బెణక్కుండా కట్టుబడివుండాలి. అంతేగాని వారు సోదరపార్టీలన్నీ ఏకగ్రీవంగా ఆమోదిం చిన ఉమ్మడి కార్యక్రమం స్థానే తమ స్వంతపార్టీ కార్యక్రమాన్ని ప్రవేశ పెట్టడాన్ని ఎంతమాత్రమూ అనుమతించరాదు.

సోవియట్ పార్టీ నాయకులు ఐక్యతను నిజంగానే కోరుతున్నట్లయితే వారీ విషయంలో నాటకమాడనట్లయితే, వారు శత్రువులకూ, కామ్రేడ్స్‌కూ మధ్య అంతరాన్ని స్పష్టంగా గుర్తించాలి. ప్రపంచ ప్రజల బద్ధశత్రువైన అమెరికన్ సామ్రాజ్యవాదానికీ, దాని తొత్తులకూ వ్యతిరేకంగా సోషలిస్టు దేశాలన్నింటితోనూ, సోదర మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీలన్నింటితోనూ, ప్రపంచ శ్రామికవర్గంతోనూ, పీడిత దేశాల ప్రజలందరితోనూ, శాంతికాముక దేశాలూ, అక్కడి ప్రజలందరితోనూ ఐక్యం కావాలి. అంతేగాని, వారు శత్రువుల్ని మిత్రులుగానూ, మిత్రులను శత్రువులుగానూ చూడ్డానికిగానీ, అమెరికా-సోవియట్ సామరస్యంద్వారా ప్రపంచాధిపత్యమనే విష్ఫలకర్మలో సోదర సోషలిస్టు దేశాలకూ, సోదర పార్టీలకూ యావన్మంది విప్లవ శక్తులకూ వ్యతిరేకంగా వారు అమెరికన్ సామ్రాజ్యవాదులతో వివిధ దేశాల్లోని అభివృద్ధి నిరోధక శక్తులతో, విద్రోహి టిటో ముఠాతో చేతులు కలపడానికి ఏ మాత్రం అనుమతించరాదు.

# సోవియట్ పార్టీ నాయకులు —నిజంగా ఐక్యతనే కోరుకుంటే...

సోవియట్ పార్టీ నాయకులు నిజంగా ఐక్యతను కోరుకొంటున్నట్లయితే, వారు నాటక మాడనట్లయితే, శ్రామికవర్గ అంతర్జాతీయతపట్ల విశ్వాసపాత్రులై వుండాలి; సోదర పార్టీలమధ్య దేశాలమధ్య సంబంధాలను నడిపే ప్రకటన పత్రాల్లోని సూత్రాలకు కట్టుదిట్టంగా బద్ధులై వుండాలి. అంతేగాని వారు, ఈ సూత్రాలను తీసిపారేసి వాటిస్థానే అగ్రరాజ్య దురహంకార విధానాలనూ, జాతీయ అహంభావ విధానాలనూ చొప్పిస్తానంటే

ఎంతమాత్రం అంగీకరించరాదు. ఒక్కమాటలో చెప్పాలంటే సోవియట్ పార్టీ నాయకులు—

* సోదరపార్టీలన్నింటి మధ్య సంఘీభావ సూత్రాన్ని పాటించాలి; ఇతర సోదరపార్టీలపై దాడికి మరికొన్ని సోదరపార్టీలను ఎన్నడూ సమీకరించకూడదు; దింపెత్తువాద చీలిక చర్యలలో పాల్గొనరాదు.

* పరస్పర సహకార సూత్రానికీ, పరస్పర సహాయక సూత్రానికి కట్టుబడి వుండాలి; ఎప్పుడూ కూడా సహాయం పేరుతోగానీ, లేదా "అంతర్జాతీయ శ్రమవిభజన" పేరుతోగానీ ఇతర సోదర సోషలిస్టు దేశాలను కంట్రోల్ చేయప్రయత్నించరాదు; సోదర సోషలిస్టుదేశాల సార్వభౌమాధికారాన్ని, ఆ దేశాల ప్రయోజనాల్ని దెబ్బతీయ ప్రయత్నించరాదు; స్వశక్తిపై ఆధారపడి సోషలిజాన్ని నిర్మించుకొనే యత్నాలను వ్యతిరేకించరాదు.

* అన్ని సోదరపార్టీలూ స్వతంత్ర సమానత్వ ప్రతిపత్తిగల ఒకే సూత్రాన్ని పాటించాలి. తాము ఇతర సోదరపార్టీలకన్నా అధికుల మనుకోరాదు; తమ స్వంతపార్టీ కార్యక్రమాన్ని, పంథాను, తీర్మానాలను తీసుకొచ్చి ఇతర సోదరపార్టీలపై రుద్ద ప్రయత్నించరాదు; సోదరపార్టీల అంతరంగిక వ్యవహారాలలో జోక్యం కల్గించుకోరాదు; "వ్యక్తిపూజా నిరోధం మిషచూపి విచ్ఛిన్న కార్యకలాపాలు సాగించరాదు, సోదర పార్టీలను ఎన్నడూ తమ స్వంత ఆస్థిగానూ, తమ అధీన సంస్థలుగానూ చూడరాదు.

* సమాలోచనల ద్వారా ఏకాభిప్రాయానికి రావాలన్న సూత్రాన్ని పాటించాలి. మెజారిటీ పేరుతోగానీ లేదా తమ స్వంతపార్టీ మహాసభలను గానీ లేక ఇతర పార్టీల మహాసభలను గానీ వినియోగించి తమ పార్టీ తప్పుడు పంథాను బలవంతానా నెగ్గించుకో ప్రయత్నించరాదు. అలాగే తమ తీర్మానాలనూ, ప్రకటనలనూ, నాయకుల బహిరంగోపన్యాసాలనూ

ఇతర్లపై రుద్ద యత్నించరాదు. సోదరపార్టీలపై బహిరంగ దాడులకు దిగరాదు; ముఖ్యంగా సిద్ధాంత విభేదాలను ప్రభుత్వాలమధ్య సంబంధాలకు విస్తరింపజేయరాదు.

* క్లుప్తంగా చెప్పాలంటే సోవియట్ పార్టీ నాయకులు నిజంగా సోషలిస్టు శిబిర, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యతనే వాంఛిస్తున్నట్లయితే, తమ రివిజనిస్టు పంథానుంచీ, అగ్రరాజ్య దురహంకారం నుంచీ, చీలికతత్వం నుంచీ పూర్తిగా తెగతెంపులు చేసుకొని బయట పడాలి. మార్క్సిజం-లెనినిజానికీ, శ్రామికవర్గ అంతర్జాతీయతకూ విధేయులైవుండాలి. ఆధునిక రివిజనిజాన్ని, ఆధునిక పిడివాదాన్ని, అగ్రరాజ్య దురహంకారాన్ని తదితర బూర్జువా జాతీయవాద రూపాలనూ, సెక్టేరియనిజాన్ని చీలికతత్వాన్ని వ్యతిరేకించడంద్వారా మాత్రమే సోషలిస్టు శిబిర ఐక్యతా, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యతా కాపాడబడుతుంది; బలవత్తరమవుతుంది. అలా మాటల్లో గాకుండా చేతల్లో చేసినప్పుడే ఈ ఐక్యత కాపాడబడుతుంది; బలపడుతుంది. ఐక్యతను కాపాడి బలోపేతం చేయడానికిదొక్కటే మార్గం.

## ప్రపంచ పరిస్థితి

మొత్తంగా చూచినట్లయితే నేటి ప్రపంచ పరిస్థితి చాల అనుకూలంగా వుంది. ఇప్పటికే అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం జేగీయమానమైన విజయాలు సాధించింది. ఈ ఉద్యమం, అంతర్జాతీయవర్గ శక్తుల బలబలాల్లో ప్రాథమిక మార్పుతెచ్చింది. ప్రస్తుతానికి అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమాన్ని రివిజనిజం, చీలికతత్వాల ఎదురుతాకిడి ఎదుర్కొంటోంది. అయితే ఈ పరిణామం చారిత్రకాభివృద్ధి సూత్రానికి పొసగనిదేమీ కాదులెండి. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమానికి ఎదురు తాకిడివల్ల తాత్కాలికంగా ఇబ్బందులేర్పడ్డా, రివిజనిస్టులు తమ అసలు రంగును బయటేసుకోవడమూ, మార్క్సిజం లెనినిజానికీ, రివిజనిజానికీ మధ్య పోరాటం ఘటిల్లడమూ మంచికే వచ్చింది.

మార్క్సిజం-లెనినిజం తన యౌవన జవజీవాలను తిరిగి ప్రదర్శించ గల దనడంలో సందేహంలేదు; యావత్ప్రపంచాన్ని అది ఆవరిస్తుందన డంలోనూ సందేహంలేదు; అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం నిస్సందేహంగా మరింత బలపడుతుంది: మార్క్సిజం-లెనినిజం ఆధారంగా మరింత ఐక్యమవుతుంది; అలాగే అంతర్జాతీయ శ్రామికవర్గ లక్ష్యమూ, ప్రపంచ ప్రజల విప్లవమూ నిస్సందేహంగా మరింత జగజ్జేగీయమానమైన విజయాలను సాధిస్తాయి. ఆధునిక రివిజనిజం దివాళాతీయడమూ తథ్యం.

ఈ విషయాలన్నింటిపైనా సోవియట్ పార్టీ నాయకులకు ఒక్క సలహా ఇవ్వదలిచాం: మీరు పొదుగుతున్న రివిజనిజమూ, చీలికతత్వమూ ఎక్కడకు దారితీస్తాయి? మరోసారి సోవియట్ పార్టీ నాయకులకు మన పూర్వకంగా విజ్ఞప్తి చేయదలిచాం: మీరు తిరిగి మార్క్సిజం-లెనినిజానికి శ్రామికవర్గ అంతర్జాతీయతకు చేరుకుంటారనీ, 1957, 1960 ల నాటి మాస్కో ప్రకటన పత్రాలలోని విప్లవ సూత్రాలకు మళ్ళీ వస్తారనీ మేమాశిస్తున్నాం. సోదరపార్టీల, సోదర సోషలిస్టు దేశాలమధ్య సంబంధాలను నిర్దేశించే ప్రకటన పత్రంలోని సూత్రాలకు తిరిగి వస్తారనీ ఆశిస్తున్నాం; ఆ విధంగా విభేదాలు తొలగిపోయి, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యతా, సోషలిస్టు శిబిర ఐక్యతా, చైనా - సోవియట్ల ఐక్యతా ఈ సూత్రాలు ఆధారంగా బలోపేతం కాగలదనీ ఆశిస్తున్నాం.

సోవియట్ పార్టీ నాయకులతో మాకెంత తీవ్ర విభేదాలున్నప్పటికీ సోవియట్ పార్టీలోని విస్తృత సభ్యత్వంలోనూ; లెనిన్-స్టాలిన్ల సారధ్యం క్రింద పెరిగిన సోవియట్ ప్రజలలోను మాకు పూర్తి విశ్వాసం వుంది. ఎప్పటిమాదిరిగానే చైనా కమ్యూనిస్టులూ, చైనా ప్రజలూ, చైనా-సోవియట్లమధ్య ఐక్యతను అకుంఠిత దీక్షతో కాపాడుతారు. ఈ రెండుదేశాల ప్రజలమధ్య వేళ్ళూనుకుపోయిన మిత్రత్వాన్ని పెంపుచేస్తారు.

ప్రపంచ కమ్యూనిస్టులారా! మార్క్సిజం - లెనినిజం పునాదిపై ఐక్యం కండి!

[సమాప్తం]

84

# తప్పక చదవాల్సిన సాహిత్యం

1. చైనా సాంస్కృతిక విప్లవానికి సంబంధించిన డాక్యుమెంట్లు రు. 0-75
2. సోషలిస్టు పంథా? లేక పెట్టుబడిదారీ పంథా? రు. 1-00
3. కార్మికవర్గ నియంతృత్వంగురించి మార్క్స్, ఎంగెల్స్, లెనిన్ బోధనలు రు. 0-50
4. టొగ్లియాటీకి మాకు గల బేదాభిప్రాయాలు – బేదాభిప్రాయాలపై మరికొంత వివరణ రు. 5-00
7. మార్క్సిజం – లెనినిజం – మావో ఆలోచనా విధానం పతాకను సమున్నతంగా నిలపండి !! [చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకుల "నూతన పంథా"పై కేంద్ర కమిటీ తీర్మానం] రు. 1-00
8. నయావలస విధాన వకాల్తాదారులు రు. 1-00
9. యుద్ధము – శాంతి సమస్యపై భిన్నమైన విధానాలు రు. 1-00
10. శాంతియుత సహజీవనం – రెండు పరస్పర వ్యతిరేక విధానాలు రు. 1-25
11. కార్మికవర్గ విప్లవం – కృశ్చేవ్ రివిజనిజం రు. 1-50

మైత్రి బుక్ హౌస్
లబ్బీపేట, విజయవాడ–10.

## Check List

| | | | |
|---|---|---|---|
| Book Number | DVK0213404 | Date | 16/5/22 |
| Front Cover | yes | Back Cover | yes |
| Blank Pages | CI, 83 | | |
| Missing Pages | NO | | |
| Prepared By | Sandhya | Cutting By | Sandhya |
| Scanned By | Sireesha | Pages | 87 |